# సమాలోచన



జాతీయ సాంస్కృతిక పక్షపత్రిక

సంపాదకుడు: విద్వాన్ బులుసు సీతారామశాస్త్రి.

సంపుటము 3 రాజమహేంద్రవరము 1-12-1979 సంచిక 3

## —* ఈ సంచికలో *—



16_12_79 సంచికలో కవితా సాధన ఒక తపస్సాధన, ఆంధ్రకవులు - అనుసరణములు, కరుణశ్రీ మానవతావాదము, కోలాచలంవారి నాటకాల్లోని సామాజికత మొదలగునవి ఉంటాయి.

—* 1, 16 తేదీలలో ప్రచురింపబడును *—

చందా
సంవత్సరమునకు రు 10_00.
అర్థసంవత్సరమునకు రు 5_50.

విడిప్రతి 50 పై.

★ సమాలోచన ★
* జాతీయ సాంస్కృతిక పక్షపత్రిక *
సంపాదకుడు : విద్వాన్ శ్రీ బులుసు సీతారామశాస్త్రి
సంపుటము 3 | రాజమహేంద్రవరము 1-12-1979 | సంచిక 3

# వివిధ వివాహములు - వ్యాససమన్వయము

— శ్రీ ఎం. కృష్ణస్వామి, ఎం. ఏ.

వివాహములు ఎనిమిది విధములుగా మన పెద్దలచే చెప్పబడినవి. అవి బ్రాహ్మము, దైవము, ఆర్షము, ప్రాజాపత్యము, ఆసురము, గాంధర్వము, రాక్షసము, పైశాచము. వీనిలో పైశాచ వివాహము అధమమైనదిగా పేర్కొనబడినది. మనుస్మృతియందు ఎనిమిది వివాహముల లక్షణములు ఈ విధముగా ఈయబడినవి.

1. వేదాధ్యయనముచేసి ఆచారవంతుడైన యొక బ్రహ్మచారిని తానుగా రప్పించి అతనికి వస్త్రాదులు బహూకరించి, మర్యాదలు సలిపి, అలంకరింప బడిన కన్యను సమర్పించుట బ్రాహ్మము. 2. జ్యోతిష్టోమము మొదలగు యజ్ఞముల యందు ఆధ్వర్యవము చేయునట్టి ఋత్విజునకు అలంకరింప బడిన కన్య నొసగుట, దైవము. 3. యాగాదిసిద్ధి కొరకుగాని, కన్య నొసగుటకు గాని, రెండుగోవులనో, రెండుఎద్దులనో వరుని కడనుండి తీసికొని శాస్త్ర ప్రకారము కన్యనొసగుట ఆర్షము. 4. మీరిరువురు కలిసి ధర్మమాచరింపు డని చెప్పి, తల్లిదండ్రులు వరుని పూజించి పిల్లనిచ్చుట ప్రాజాపత్యము. 5. జ్ఞాతులకును, పిల్లకును వలసిన ధనమునిచ్చి వారిఇష్టముతో పెండ్లి చేసికొనుట ఆసురము. 6. స్త్రీ, పురుషులు లొండొరులు అపేక్షచే సమ్మతించి కలియుట గాంధర్వము. ఇది కామసంభవమైనదియు, మైథున కర్మకు ఏర్పడినదియు, నైయున్నది. 7 కన్యక బంధువులు సమ్మతింపనపుడు వారిని చంపిగాని, నరకిగాని, చీల్చికాని, బంధునాశనమునకై వగచుచున్న కన్యను బలవంతముగాఁదెచ్చుట రాక్షసము. 8. నిద్రించుచున్న స్త్రీని గాని, కైపులో నున్నదానిని గాని, ఏమరుపాటున నున్నదానిని గాని బలాత్కారమొనరించి ఏకాంతమున క్రీడించుట పైశాచము. ఈ ఎనిమిదవ వివాహము మిక్కిలి అధమమైనది. ఇదికాక స్వయంవర మను వివాహ విధానమొకటి పురాణేతిహాసములలో ప్రసిద్ధముగ కన్పట్టుచున్నది. సీతా స్వయంవరము దమయంతీ స్వయంవరము ద్రౌపదీస్వయంవరము మొదలైనవి ఇందు కుదాహరణములు.

ఈవిధము క్షత్రియులకు మాత్రము పరిమితమైనదిగా కన్పట్టుచున్నది. పెద్దలందరి సమక్షమున స్వయంవరమునకు విచ్చేసిన రాజకుమారులలో వధువు తనకు నచ్చిన రాజకుమారుని ఎన్నుకొనుటగాని, పెద్దలచే నిర్ణయింప బడిన పరీక్షలలో నెగ్గిన వారిని వధువు వరించుట గాని జరుగుట దీనియందలి సంప్రదాయము.

ఈ నవవిధ వివాహములలో మహాభారతమున నాలుగువిధములైన వివాహములు ప్రసక్తముచేయబడినవి. అవి బ్రాహ్మము, గాంధర్వము, రాక్షసము, స్వయంవరము. వీనిలో గాంధర్వ, రాక్షసములు శాస్త్ర సమ్మతములే అయినను అంత క్షేమదాయకములు కావని వ్యాసుని ఉదాహరణ పూర్వకమైన ఉపదేశము. శకుంతలా దుష్యంతులకు జరిగినది గాంధర్వ వివాహము. అనగా వారిరువురు ఒకరి కొకరు ఇష్టపడి చేసికొనినారు. క్షత్రియులకు గాంధర్వముశాస్త్రసమ్మతమని దుష్యంతుడు శకుంతలకు నచ్చచెప్పగా ఈ వివాహము జరిగినది. అట్లు నచ్చచెప్పిన దుష్యంతుడే శకుంతలను తీసుకుని వెళ్ళక పోగా ఆమెకు బిడ్డ కలిగిన తరువాత కణ్వునిచే పంపబడినపుడు 'నీ వెవరో నాకు తెలియ' దని నిరసించి అవమానించినాడు. శకుంతల ఎన్నివిధములుగా నచ్చచెప్పినను అతడు దారికి రాలేదు. అప్పుడు ఆకాశవాణి కలుగచేసుకొని అందరకు వినపడునట్లుగా సత్యమును తెలియచెప్పవలెనని వచ్చినది. ఇచ్చట దివ్యవాణి పలుకుట యనగా మరియొకరి సాక్ష్యము లేకుండుట వలన గాంధర్వమున స్త్రీకిరక్షణలేదని తెలియజేయబడినది. చక్రవర్తి, ధర్మరక్షకుడు అయిన

దుష్యంతుడే ఇట్లు ప్రవర్తించె ననగా ఇక సామాన్యుల విషయము చెప్ప నేల? ఈ సత్యమును తెలియ జెప్పుటకే శకుంతలా దుష్యంతులగాథను జరిగినది జరిగినట్లుగా వ్యాసభగవాను డిచ్చినాడు. భారతమునందే తపతీ సంవరణోపాఖ్యానమున ఈ గాంధర్వవివాహము నిరసింపబడినది. సంవరణుడు క్షత్రియుడు. సూర్యుని పుత్రిక అయిన తపతిని ప్రేమించి గాంధర్వమున వివాహమాడెద నన్నాడు. తపతి అది పద్ధతి కాదనియు, స్త్రీకి స్వేచ్ఛ లేదనియు, తన తండ్రి నడిగి స్వీకరింప వలసిన దనియు; సంవరణునకు స్పష్టముగ చెప్పినది. ఆపైని సంవరణుని స్థితి చూచి వసిష్ఠుడు మధ్యవర్తిత్వము నెరపి సూర్యుని ఒప్పించి తపతీ, సంవరణులకు వివాహము జరపించినట్లు చెప్పబడినది. శకుంతల పడని జాగ్రత్త తపతి పడినది కనుకనే ఆమె జీవితమునవట్టి సమస్యలను ఎదురుకాలేదు. కనుక శాస్త్రసమ్మత మైననూ గాంధర్వమున స్త్రీలకు రక్షణ లేదనియు, కావున అది అనుసరణీయము కాదనియు భారతము ధర్మాద్వైతస్థితిని ప్రతిపాదించుచున్నది.

గాంధర్వము వలెనే రాక్షసముకూడ అంతగా అనుసరణీయము కాదని భారత ముపదేశించుచున్నది. భీష్ముడు తన తమ్ముడైన విచిత్రవీర్యుని కొరకై కాశీ రాజపుత్రికలను రాక్షస వివాహ పద్ధతిని జయించి తీసుకుని వచ్చినాడు. కాశీరాజు కుమార్తెలకు తలపెట్టిన స్వయంవరము భీష్ముని రంగప్రవేశముతో రాక్షసముగ రూపొందినది. అడ్డుపడిన సాళ్వాదులను జయించి భీష్ముడు అంబ, అంబిక, అంబాలికలను తమ్మునికై కొనితెచ్చినాడు.

భీష్ము డనుసరించిన రాక్షసవిధానము శాస్త్రసమ్మతమే. కాని కథ అడ్డు తిరిగినది. అంబ తన మనస్సు సాళ్వునకు అర్పించినట్లు బయటపెట్టినది. భీష్ముడు సగౌరవముగా ఆమెను సాళ్వుని కడకంపినాడు. భీష్మునితో యుద్ధమున ఓడిన సాళ్వుడు అంబను నిరాకరించినాడు. ఆపైని అంబ భీష్ముని చేరినది. జరిగినకథ తెలిసిన భీష్ముడు మరియొకరిని వలచిన వనితను తన తమ్మునికి భార్యగ చేయలే ననినాడు. అంబ భీష్మునే స్వీకరింపుమన్నది. భీష్ముడు తన ప్రతిజ్ఞను గుర్తుచేసి నిరాకరించినాడు. అంబ భీష్మునిపై పగబట్టినది. ఆ జన్మలో సాధ్యపడక తరువాతి జన్మమున శిఖండిగ జన్మించి భీష్ముని మరణమునకు నిమిత్తమైనది.

రాక్షస వివాహ విధానమున వధువుల మన స్సెరుగుటకు అవకాశము లేనందున ఇంతటి ముప్పువాటిల్లినది. కనుక శాస్త్రసమ్మతమే అయిననూ రాక్షసము ఆశ్రయింప దగినది కాదని వ్యాసుని బోధ. ఇచ్చట రుక్మిణీకల్యాణమును పరిశీలనకు తెచ్చుకొన్నచో మరి కొంత సమన్వయమగును. రుక్మిణీకల్యాణముకూడ రాక్షసమే. తన్ను రాక్షస విధానమున తీసుకు వెళ్ళవలసినదిగా రుక్మిణియే కృష్ణునకు కబురు పెట్టినది. ఆమె ఆహ్వానమునను మన్నించి కృష్ణుడు వచ్చినాడు. రుక్మిణి సోదరుడైన రుక్మి, శిశుపాలుడు, అడ్డగించి; కృష్ణుని చేతిలో ఓడుటలో రుక్మిణీ, కృష్ణుల వివాహము రాక్షస వివాహమైనది. కాని ఇచ్చట వధువు మన స్సెరిగి కృష్ణుడు మసలుటవలన, వధువే మనసార కృష్ణుని కోరుటవలన కథ అంతయు శుభప్రదముగ నడచిపోయినది. రుక్మిణీ కల్యాణమువంటి విశిష్ట ఘట్టములలో తప్ప అనగా వధువులే మనసార వేడినప్పుడు తప్ప, రాక్షసవివాహ విధానము అనుసరణీయము కాదని వ్యాసభగవానుని సమన్వయాత్మకమైన సందేశము.

—0—

# వ్యక్తి - శక్తి

సాహిత్యరత్న
.వి ఎల్. సుబ్బారావు,
.ఏ., బి.ఎస్‌సి., బి.ఇడి.

ఒక వ్యక్తిని చంపేస్తే
ఏమవు తుంది?
భూమి పగులు తుందా!
ఆకాశం విరుగు తుందా!
వాయువు ఆగు తుందా!
అగ్ని ఆరు తుందా!
వెలుగు క్రుంగు తుందా!
అని గేలిచేసే వారిని,
ప్రపంచాన్నే గెలిచా మనుకొనేవారిని,
వినమని ఒక చిన్న మనవి.
ఆ వ్యక్తిలోని శక్తి ఏమవుతుంది?
ఆ శక్తికి మృత్యువు ఉందా!
ఐయిన్‌స్టీన్ సూత్రం మననం చేసికొ
ఆవగింజంత ఆటమ్‌లో పదార్థపరిణామెంత!
ఆశక్తి ప్రభావం నీవు ఊహించలేనంత
బక్క చిక్కిన మనిషిలో ఉన్న దేమిటి!
అని హేళని చేయకు.
వాడిలోని కోటాను కోట్ల ఆటమ్‌లు
విచ్ఛిన్నమయితే, శక్తి విడుదలయితే,
కాంతి వేగంతో దూసుకొచ్చే మహాశక్తి
భూమిలో భూకంపం,
ఆకాశంలో అగ్నిగుండం,
వాయువుకు యమగండం,
అగ్నికి ఆరని చెద,
వెలుగుకు దృష్టిలోపం,
కల్గించి తీరుతుంది.
వేచి చూడు.

# బొబ్బిలి యుద్ధకథలో బుస్సీపాత్ర

— శ్రీ యెందువ జగన్నాథనాయుడు, ఎం. ఏ.

భారతదేశమున వీరగాథ లెక్కువగా నున్న రాష్ట్రములలో ఆంధ్రదేశమొకటి. పౌరాణికములు, చారిత్రకములు, సాంఘికములు మున్నగు విభాగముల క్రిందికి వచ్చు వీరగాథలు తెలుగులో కోకొల్లలుగా నున్నవి. సంఖ్యాబలముననే కాక ప్రాశస్త్య ప్రాచీనతలలో గూడ నివి పేర్కెక్కినవి. మనబొబ్బిలికథ ప్రపంచమున వేళ్ళపై లెక్కింపదగిన అత్యుత్తమ వీరగాథలలో నొకటి. తెలుగువారు వీర విక్రములనియు, ధైర్యసాహసోపేతు లనియు, అభిమానధనులనియు, వారి శౌర్య మఖండమనియు చేయెత్తిచాటునది 'బొబ్బిలికథ.' ఇది ప్రాక్ప్రతీచీ విమర్శకులు చెప్పిన వీరగాథా లక్షణము లన్నింటిని పుణికిపుచ్చుకొనిన పరమప్రశస్త వీరగాథ అని డా. టి. వి. సుబ్బారావుగారు నుడివిరి. ఈయుద్ధకథ తెలుగు రక్తములో జీర్ణించిపోయిన వీరగాథ యనుట అతిశయోక్తి కాదు. ఇది కేవలము కథకాదు. యథార్థముగా జరిగినది. ఈబొబ్బిలికథ పదము జానపదుల నోళ్ళల్లో పలుచోట్ల ఇప్పటికీ వినబడుచున్నది.

క్రీ. శ. 1957 సం॥లో విజయనగర సంస్థానాధీశుడగు పూసపాటి విజయరామరాజు ఫ్రెంచివారి సాయముతో తనపొరుగు సంస్థానమైన బొబ్బిలికోటను ముట్టడించిన కథ యిందలి యితివృత్తము. ఈ బొబ్బిలికథకు పదములలో రెండు భిన్నరచన లున్నవి. ఒకటి పెద్దాడ నాగేశం కొడుకు మల్లేశం గ్రంథం చివర పేజిలో చివరి రెండుపంక్తులలో తాను చెప్పినట్లు వ్రాసికొనెను. వేరొకదానికర్త పేరు తెలియదు. ఈ రెండు గ్రంథముల యాధారముగా 'బుస్సీ' పాత్రను చిత్రించుట యీవ్యాస ముఖ్యోద్దేశము. బొబ్బిలి పదమున కిపుడు మూడు పాఠములు గాన్పించుచున్నవనియు, ఆ మూడవది కొంతం నృసింహాచారులుగారి బొబ్బిలిరాజుకథ యనియు ఆచార్య బి. రామరాజుగారు నుడివిరి.

బొబ్బిలి వెలమదొరలకు క్షత్రియులైన విజయనగరము పూసపాటిరాజులకు జరిగిన యుద్ధమునకు పరోక్షముగా కారకుడు బుస్సీదొర. ఈ యుద్ధమునందు బుస్సీది కీలకమైన పాత్ర. ఇతడు లంచగొండి. అయినను నితనికి తన్ను నమ్మినవారికి సహాయము చేయుట, వీరులయందు గౌరవము, స్త్రీ బాలుర యెడ అభిమానము, గలవు. పాపపుణ్య విచక్షణ, పాపభీతి, గలవాడు బుస్సీ. అయినను సహజ రాజనీతి చాతుర్యము గలవాడు. లంచము తీసికొనుట మూలముగా నితని మంచితనమంతయును మాయమై యాతడు బొబ్బిలి యుద్ధమునకు పరోక్షముగా కారకుడయ్యెను.

పుదుచ్చేరిలో నున్న బుస్సీ జమాబందికి గోలుకొండ వెళ్ళినాడు. జమాబంది అయిన తరువాత బుస్సీ తూర్పుదేశము చూడ నిశ్చయించి గోలకొండనవాబు అనుమతిని కోరగా, నవాబు అనుమతి నీయలేదు. లంచముతీసికొనుటలో నేకాక, లంచ మిచ్చుటలోను నేర్పరియైన బుస్సీ నవాబుకు లంచ మిచ్చి అనుమతి తీసికొని దుబాసి లక్షుమన్నతో తూర్పు దేశము చూచుటకు బయలుదేరినాడు. రాజమహేంద్రవరము నొద్ద డేరాలు వేసి విజయరామరాజుకు తన రాకను ఎఱుకపరచి జాబు వ్రాసి పంపినాడు. విజయరామరాజు బుస్సీ పంపిన జాబును చూచి బొబ్బిలి రంగారాయునికి క్రిందివిధముగా జాబు వ్రాసినాడు.

'వెనుకటి పగలూ మదిలో వద్దు
రంగారాయుడా
కోడి పందెమునాటి పగలూ
మదియందున వద్దు
పిగిలి పిట్టలనాటిపగలూ మదియందునవద్దు
ఇపుడు పుదుచ్చేరి యేలువాడు
ప్రాంచీలజాచి
యెదురు సేవకు రమ్మని నాకు
జాబు వ్రాసినాడ
తెల్లవారి నీకు జాబు లంపితి
రంగారాయుడ
జాబులు చూచిన తక్షణమందున
రంగారాయుడ
పాలకియెక్కి విజేనగరము నా భేటికి
రమ్మా

విజయరామరాజు బొబ్బిలి రంగారాయునితో కలిసి బుస్సీ భేటికి వెళ్ళవలయునని పై జాబును రంగారాయుని వ్రాసినాడు. రంగారాయుని తమ్ముడు వెంగళరాయుడీ జాబును చూచి –

'రాజు వారి పౌరుషము యింతేనన్నాడ
తానుబిలిచితే తానుపోవలె బూచీ భేటి
తాను కొప్పుపెట్టుకొని కోక కట్టుకొ
కోటలో వున్నాడ
మూతి మీసం లేకవున్నాడా
కోటకులోగాను'—

అని విజయరామరాజును నిందించాడు. రాజును నిందించుటే కాకుండ, రాజ పంపిన జాబును చించి, జాబు తెచ్చి హర్కారుల చెంపలువాయించి, మెడల బట్టి నెట్టించినాడు వెంగళరాయుడు. ఈవిషయము విన్న విజయరామరాజు –

'కుడిమీసమే దువ్వినాడుగ
గుడ్లు యెర్రజే
పక్కలోనబల్లెము గదర బొబ్బిలిదరబా
నాకంట్లో నలుసై తిరుగుతున్నది
యీ బొబ్బిలికో
పుట్టకోట చప్పంగా దున్ని
పొగ పొంకలు చేతు

అని బొబ్బిలివారిమీద కోపము తెచ్చు కొనినాడు.

రాజమహేంద్రవరమున బుస్సీ దర్శనముచేసి నప్పుడు విజయరామరాజు బొబ్బిలివారి మీద తన పగతీర్చుకొనుటకు అదియే తగిన అదనని సర్కారులలో ఫ్రెంచివారికి రావలసిన పైకము చెల్లకుండ జేయుటకును, ఫ్రెంచివారి యధికారమును, పాళెగాండ్లు మొదలైన వారు ధిక్కరించుటకును మూలకారణము రంగారావే యని ఇంకను అతనిమీద ఏవేవో నిందలు మోపి, బొబ్బిలి కోటలో నుంచి రంగారావును వెళ్ళగొట్టి దానిని తనఅన్న కుమారుడు ఆనందగజపతి రాజుకు దఖలు పరచవలసిన దని బుస్సీని వేడుకొనినాడు. బుస్సీ కొంతసేపు వినని వాని మాదిరిగా ఊండి పోయినాడు. తరువాత బుస్సీ రాజుతో.

'ఒకరి భూములు ఒకరికి నేను
యెట్లా యిచ్చేది
నిజా మెరిగినా పాళెగాడుగా
రంగారాయుడు
గోలకొండ నవాబులతోను
మాట వచ్చు నాకు'

అని చెప్పినాడు. నవాబుచే మాటపడుటకు బుస్సీ యిష్టపడలేదు. కాని విజయరామరాజు బుస్సీతో –

'జడియబోకుమా వెరవబోకుమా
బుస్సీ దొరగారు
డెబ్బైయిద్దరు మన్నెగాండ్లకు
రాజును నేనేమి
మాటవ స్తేను గోలకొండకే నేనే వస్తాను
గోలకొండ నవాబులు విన్న
మాటలాడగలను'–

అని పెద్ద పెద్దమాటలు చెప్పి ఒంటి కొమ్ము పెద్దేనుగును, తనకు నిజామిచ్చిన కర్రి గుఱ్ఱమును కాన్కపెట్టి రెండు వేల వరహాలను బుస్సీనుండు గ్రహించి నాడు. వరహాలను చూచిన బుస్సీదొర బొబ్బిలి కోటను ఆనందరాజుకు వ్రాసి నాడు.

విజయరామరాజు బంగారపు గొర్రె పాత్రేళ్ళతోను, వెండివి రెండు సివంగులతోను, బంగారపు కుర్చీపీట జోడంగీలతోను, బంగారపు కోడి పుంజులు, కోడి గ్రుడ్లు, నిమ్మపండ్లు, పనసపండ్లతోను బుస్సీ భేటికి వెళ్ళినాడు. రాజు వేసిన నగారా దెబ్బ విని బుస్సీ చూడగా, ఏనుగుల బారు గుఱ్ఱములు, డేరాలు కన్పించినవి. 'నాతో మనవికి వచ్చేరాజుకు అంతబలముయేల? మనవికా యుద్ధానికా తెలుసుక రమ్మని హైదరు జంగు లక్షుమన్నలతో' బుస్సీ చెప్పి, ఇంకను లక్షుమన్నతో –

'యుద్ధానికి వస్తావుండేనా విజేరామరాజు
బలకట్లూ పడవలూ మనకు తయారు
చేయించు
తిరిగిమళ్ళాను గోలకొండకే మనమే
పోదాము
రాజును – కొట్టడానికి గోలకొండలో
సెలవులేదు నాకు, –

అని చెప్పినాడు. విజయరామరాజు యుద్ధమునకు వచ్చుచున్నాడేమో యని బుస్సీ భయపడి తిరిగి గోలుకొండకే వెళ్ళుటకు నిశ్చయించుకొనినాడు.

హైదరుజంగు లక్షుమన్నలు విజయరామరాజునొద్దకు వెళ్ళిరి. రాజు యిచ్చిన లంచమును తీసికొని బుస్సీకడకు వచ్చి బుస్సీతో –

'ఇరవై నాలుగువేల బలముతో రాజు
వచ్చినాడు
ఉగ్రుడుగానే వున్నాడయ్యా కళింగ
పెదరాజు
మే మిద్దరమూ వెళ్ళగ రాజు కొంత
పడ్డదేమో
రాజు – చెప్పినటు మనం వినకపోతే
బూసీదొరగారు
తూర్పుభూముల మనను గట్టిగా కండ్లం
జూడనీడు'

అని తేనిపోనిమాటలు చెప్పినారు.

'ఆ మాటలకు బహుసంతోషించిరి పరాసులాదొరలు'–అనగానిట బుస్సీకిగల భయము వ్యక్తమగుచున్నది. తనపై యుద్ధమునకు రాజు రాలే దని బుస్సీ బహు సంతోషపడి, రాజు చెప్పినమాట వినుటకు బుస్సీ సిద్ధపడినాడు.

తూర్పుదేశము చూచుటకు బయలు దేరిన బుస్సీని బొబ్బిలిరమ్మనినాడు విజయరామరాజు. కాని బుస్సీ 'బొబ్బిలి నేను రాను. కావలె నంటే హైదరుజంగు, లక్షుమన్నలను తీసుకువెళ్ళ మని రాజుతో అనినాడు. అయినా పట్టుపట్టి రాజు 'మహాప్రభో! కామందు లేనికయ్యముయేమి గడిఎంతోలేదు మీరందాకా రమ్మని'

బుస్సీతో అనినాడు. నిజానికి బొబ్బిలి వారితో యుద్ధముచేయుట కిష్టములేదని పైవాక్యములవలన తెలియుచున్నది. అయినను రాజు ఒత్తిడివలన బుస్సీకి బొబ్బిలి బయలుదేరుట తప్పలేదు.

బొబ్బిలి నేలుచున్న రంగారాయునికి విజయరామరాజు బుస్సీతోసహా యుద్ధమునకు వచ్చుచున్నా డని తెలిసినది. రంగారాయుడు బావమరదియగు ధర్మరాయుని పరాసువారిభేటికి రాయబారముపంపినాడు. ధర్మారాయుడు బుస్సీతోసంధిమాటలు న్యాయముగానే పలికినాడు. ఎదుగుభేటికి రాలేమగనుక దానికి పైకము చెల్లిస్తామనినాడు. 'పూసపాటివారికి మాకుయుద్ధము జరుగును. తమాషాగామీరు చూడండి. ఎవరు యుద్ధములోజయిస్తే వారికి ఓడిపోయిన వారిరాజ్యం యివ్వండి' అనిబుస్సీతో ధర్మారాయుడనినాడు. ఈ మాటలు విన్న బుస్సీ 'విజయరామరాజు తన్ను నమ్మి వచ్చినాడు గావున రాజుకును వీరికిని సంధి కుదిరితే మనము తత్క్షణమే పురుచ్చే

రికి శౌర్యగల'మని జవాబుగా లక్ష్మన్నతో పలికినాడు.

బుస్సీకి కావలసినది వీరి యుద్ధము కాదు. బొబ్బిలికోటను పూసపాటివారికి అప్పగించాలనీ కాదు. తన్ను నమ్మివచ్చిన వాడు విజయరామరాజుగనుక రాజును కాదనలేక పోవుచున్నాడు. వీరిరువురి మేలునుకోరి సంధి కుదుర్చుకొమ్మనినాడు. 'నమ్మివచ్చినవానికి ద్రోహము చేయలేను. నాచేతితో వానిని నేను పట్టిచూపను. పాలకొండకడ్డ భూములు మీకు చూపిస్తాను' అని బుస్సీ ధర్మారాయునితో అనినాడు. పౌరుషముంటే తమదే యనుకొని యున్న వెలమవీరులు బొబ్బిలికోటను విడిచిపోతారా ?

'రాజమహేంద్రవరము భేటీకీ రాకపోవుట మాది నేరమైనచో రాజమహేంద్రవరమునుండి బొబ్బిలివరకు మజిలీకి వెయ్యేసిరూపాయిలు చొప్పునయిస్తాము. మాకు రాజులతో పనిలేదని ధర్మారాయుడు బుస్సీతో అనగా 'అలాగైనా తే జమాబంది వు చేయవోయి ఓ హైదరుజంగు' అని బుస్సీ పలికినాడు. ఇట బుస్సీ పాత్ర చాల సౌమ్యముగా కన్పించుచున్నది. కాని విజయరామరాజునుండి లంచము తీసికొనిన హైదరుజంగు రాయబారము కుదరనీయ లేదు.

బొబ్బిలిపురి, వెంగళరాయుని బావమరది, యగు తాండ్రపాపయ్య బొబ్బిలి కోటలో లేడన్న విషయము విజయరామ రాజునకు తెలిసినది. రాజు బుస్సీకడకు వెళ్ళి 'పాపయ్య కోటలో లేడు. ఇదే సమ సమయము. తెల్లవారితే కోట మనకు సాధ్యముకాదు. పాపయ్య' రంగారాయుడు ఇద్దరు కలిసిన హైన -

నిన్ను కనుమలు దాటిపోనిస్తాడా

తాండ్రపాపయ్య

గోలకొండ యీసందున నీకు గోరీకట్టించు'

అని అనుసరికి బుస్సీ భయపడి పేరు కల్గిన సుబేదార్లను పిలిచి తనకు ప్రాణ హానివచ్చునన్నే భయముతో విజయరామ రాజుకు కావలసినంత సహాయము యుద్ధములో చేసినాడు.

యుద్ధములో మూర్ఛపోయిన వెంగళ రాయుని చూచి బుస్సీ-

'నీ చక్కదనము నేనెట్లా మాతును.

దొర వెంగళరావు

ఎదురుగాయమే ఒకటి లేదుగా

వెంగళరాయునికి

ప్రాణభయ మేమీ లేదయ్యా

వెంగళరాయునికి

తగినవారి యింగ్లలోను పెండ్లిచేసుతాను'

అనినాడు, రంగారాయుని యుద్ధనైపుణ్యమును విని బుస్సీ-

'ప్రాణంతోను రంగారావును

పట్టుకు రమ్మనెను

ఎప్పటివలెనే వారికి దేశం

మొఖాస యిస్తాను

తగిన వారియిండ్లలోను పెండ్లిచేసుతాను'

అనినాడు, ఇలా బొబ్బిలివారిని ఒక్కొక్కరిని మెచ్చుకొనినాడేగాని ఎవరినీ ద్వేషింప లేదు. వీరులయందు నీతనికి గల అభిమానము పైవాక్యములలో వ్యక్తమగుచున్నది.

రంగరాయుని కుమారుడగు వెంకట్రాయుని బుస్సీ యెత్తుకొని ముద్దులాడుచుండగా, విజయరామరాజు అంతలో వచ్చి ఆ బాలుని చంపుటకు ఆజ్ఞ నిమ్మనినాడు. బుస్సీ ఒప్పుకొనలేదు. అపుడు రాజు బొబ్బిలి వారి శూరత్వమును బుస్సీని చూడమని చురకత్తులు, బాకులు, అటుకులు, పంచదార, పైడి బిళ్ళల పుస్తకములు మొదలైన వాని నుంచి వెంకట్రాయుని విడిచిపెట్టినారు. ఆ పిల్లవాడు అటుకులను, పంచదారను చూడక ఒక బాకును మాత్రమే తీసికొని రెండుచేతులలో నిలబెట్టినాడు. అపుడు బుస్సీ-

'సెబాస్ రే పులిపిల్ల పులిపిల్లే' అని మెచ్చుకొని విజయరామ రాజును పాపకర్ముడని నిందించి వెంకట్రాయునికి సవారి కట్టించి సాలూర్లకోట పంపినాడు.

పైవాక్యములలో బుస్సీ హృదయము సున్నితముగా కనబడుచున్నది.

హైదరుజంగు, లక్ష్మన్న, రాజు, బుస్సీ, యుద్ధము ముగిసినపిమ్మట బొబ్బిలి కోటలోపలకు వెళ్ళినారు, కోట లోపల పీనుగులమీద పసిబాలురు పాలు త్రాగుటను బుస్సీచూచి గోడుగోడున దుఃఖించినాడు.

తరువాత విజయరామరాజు తాండ్రపాపయ్య చేతిలో చనిపోయినాడనివిని-

'బొబ్బిలివారి ఉసురు రాజుకు

తప్పక తగిలింది

స్త్రీహత్యా శిశుహత్యా (పాపం)

రాజుకు తప్పక తగిలింది అనినాడు.

మార్టిన్ అనుగ్రంథకర్త 'దక్కనులో బుస్సీని గూర్చి యిట్లు వ్రాసియున్నాడు.

'బుస్సీ హిందూదేశంలోని రాజులతో మెలగవలసిన పద్ధతులను చక్కగా గ్రహించినవాడు. వారి వారికి తగినట్లు మర్యాదతో ప్రవర్తించును. వారి యనుమతి చెందక ఏ కార్యము చేయడు. అతని యధికార భావము లేశమయినను పొడకట్టదు. దుర్బలులను పరాజితులను అతడు ఎన్నడును తృణీకరించినట్లు చూపట్టదు. తనవశమున యుద్ధమున కాయత్తమైన సైన్య ముండినను శాంతి స్వముకంటె మార్దవము, పోరుకంటె పొందు, హింసాదూషితమైన విజయముకంటె అహింసాభూషితమైన మానవ ప్రాణ రక్షణము, ప్రశస్తము అని ఆతడు నిరంతరము భావించును. అతని సంకల్పములు దృఢములు. కార్యములు ధైర్య సాహసోపేతములు.'

బొబ్బిలి యుద్ధకథ, పెద బొబ్బిలి రాజుకథ, గ్రంథముల యాధారముగా ముందు చెప్పిన బుస్సీ యొక్క గుణములకు మార్టిన్ వ్రాసిన 'దక్కనులో బుస్సీ' అను గ్రంథములోనున్న బుస్సీ గుణములకు సామ్యము గలదు.



# ఉత్తర గోగ్రహణము - వర్ణనా వైచిత్రి

— శ్రీ కె. అప్పలస్వామి.

( గతసంచిక తరువాయి )

అర్జునుని యజ్ఞాత వాసకాలముపూర్తి యైనదనియు, వచ్చిన వాడు ఫల్గునుఁడ నియు, జయాపజయములు దైవాధీనముల నియు కనుక పట్టుదలతోఁ బోరవలె ననియు భీష్ముఁడు దుర్యోధనుని నితర వీరులను బ్రోత్సహించును. ఆ సందర్భము మూలమున నున్నను ననువాదము నాయ కోత్కర్షకమైన సొంపు సంతరించు కొన్నది.

ఉత్తరుడు సారథిగా అర్జునుఁడు కౌర వ సేనను సమీపించినప్పటి కౌరవ సేన స్థితి మూలనమును బహుధా మెఱుగు పెట్టు నట్లున్నది. మూలమునందిట్లున్నది.

తథా వ్యూఢే ష్వనీకేషు
కౌరవేయేషు భారత
ఉపాయా దర్జునస్తూర్ణం నాదయన్ ...
దదృశుస్తే ధ్వజాగ్రం వై
శుశ్రువుశ్చ మహాస్వనమ్
దోధూయమానస్య భృశం
గాండీవస్య చ నిస్వనమ్
తతస్తు సర్వ మేవేక్ష్య
ద్రోణో వచన మబ్రవీత్
మహారథమనుప్రాప్తం
దృష్ట్వా గాండీవ ధన్వినమ్.

వీర రసోచితమైన యీ సందర్భ మను వాదమున రమణీయమై యిట్లున్నది.

దేవదత్తాభీల రావంబు వీనుఁ గర్ణ
ములదాటుకొన కీడు మొగముపడుచు
రథనేమి దళిత ధరా ధూళి యంగంబు
లెల్లఁ గప్పఁగ వెలు వెల్ల నగుచు
బహుళ కపిధ్వజ ప్రభలు లోచనములం
మిఱుమిట్లు గొనఁ బర్వమేడు పడుచు
నుద్భటాకార సముద్ధతి మనములు
త్తలపాటు తోఁపఁగఁ దల్లడిల్లుచు

నడచు కౌరవరాజ సైన్యంబుఁ గడిసెఁ
దీగ తిగిచిన గతిఁ దన తేరు మెఱయ
రయముమైఁ జని ప్రళయ భైరవ సహస్ర
గర్జనోదగ్రతర్జనుడర్జునుండు.వి. చ 243.

ఇటులనే చూచుటతోడనే ద్రోణుఁ డర్జునుని వర్ణించును. ఓజోభరిత శైలీ విరాజమానమైన యనువాద మిచట నొప్పియున్నది. ఇట మూల మిట్లున్నది.

ఏతత్ ధ్వజాగ్రం పార్థస్య
దూరతః సంప్రకాశతే
ఏష ఘోషః సరథజో
రోరవీతి చ వానరః
ఉత్కర్షతి ధనుశ్శ్రేష్ఠం
గాండీవ మశనిస్వనమ్.

దీని కనువాద మిట్లున్నది.

విలసద్గాండివ చాల నోద్ధతి కన
ద్విద్యుల్లతాలీలగా
నళఘుస్ఫార కపిధ్వజ ధ్వని సము
ద్యద్దిగ్గజ చండంబుగా
జలదాకారత నొందెఁ దేరితఁడు ప
ర్జన్యాకృతిం బొల్చె దో
ర్బలతీ వ్రారినిదాఘమర్విషహా గ
ర్వస్ఫూర్తి నిర్మూర్తి గాన్.వి.చ.251

అనంతరము చెప్పఁదగినది యుద్ధ వర్ణనము మహాభారతమున చివరకు శాంతి రసము నిల్చినటుల విమర్శకుల యూహ. కాని మొత్తముపై నాద్యంతము వీర రసమునకు విశేష ప్రాముఖ్యమున్న దనుట నిర్వివాదము. తిక్కన స్వయముగా యుద్ధములు చూచినవాఁ డగుట వలన యుద్ధవర్ణనమున నేర్పు ప్రదర్శించినాఁ డని పలువురి యూహ. కారణము లెవ్వి యైనను తిక్కన యుద్ధసందర్భముల పట్ల మైమరచి పాఠకుల నావేశోత్కంఠుల నొనర్పగల యోజోభరిత వర్ణనమును ప్రదర్శించి యున్నాఁడు. సహజముగా శృంగార ఘట్టములలో నమూలక వర్ణనములఁ జూచి విమర్శకు లానందించుట పరిపాటి. కాని యుద్ధవర్ణనమున విశేషముగ నమూలకమైన రసోచితమైన వర్ణనలు గలవు. బీజప్రాయముగా భావము మూలమున నున్నను విపులీకరణముచే నంతయు నమూలకముగనే తోచును. ఇందురమణీయము లగు యుద్ధవర్ణనలొండు రెండు మాత్రము చూపుదును.

గోరబోఁజినమాడ్కిఁ గొన్నింటిఁ జక్కసాఁ
బాలుగా వ్రయ్యలు వాపివాపి
బాడిస నఱికినభంగి గొన్నింటిఁ దు
త్తునియలుగా బిట్టు త్రుంచి త్రుంచి
వెసఱంపమున నిడ్డ వసిగఁ గొన్నిటి నిసు
మంతలుగా నుఱుమాడి యాడి
పనివడి ఱోలఁ గొట్టిన లీలఁ గొన్నింటిఁ
జిఱునుగ్గుగాఁ బొడిచేసి చేసి
యడరి పొదివిన బలము నానాయుధముల
ప్రతిహతంబులఁ గావించె నతి రయమున
నక్షత ధ్వజనూతహయత్వ లసద
ఫల్గు రథవల్గనుం డగు ఫల్గునుండు
విరాట. పం. 37

కర్ణార్జునుల యుద్ధసందర్భము మూల మునకు మెఱుఁగు పెట్టుచున్నది. అర్జునుని బాణములు కర్ణునిఁ గప్పగా కర్ణుఁడు ఆ బాణములను ఛేదించెను. ఆసందర్భము మూలమున నిట్లున్నది.

స పాండవ స్తూర్ణముదార్ణకోపః
కృతాగసం కర్ణ ముదీక్ష్య హార్షాత్
క్షణేన సాశ్వం సరథం ససారథి
మ న్తర్దధే ఘోరశరౌఘవృష్ట్యా.

అనువాద మిట్లున్నది.

ప్రళయాంభోధరముక్త సాంద్ర విసర
త్పాషాణవర్షంబు మి
క్కిలి రౌద్రి శైలముఁ గప్పునట్లు నరు న
శ్లీణాస్త్ర సంతాన మి
ట్టలమై కప్పినఁ దీవ్ర మారుతముగా
ధవాప్తిజీమూతముం
డలి బోలెన్ విరియించె భానుజుఁడవ
ష్టంభోజ్వలాకారుఁడై. విరా. పంచ.

మూలమున బీజప్రాయముగ భావము న్నను కర్ణార్జునుల యుద్ధసందర్భమున అర్జునుని పరాక్రమముచే చిందరవందర యైన కౌరవ సైన్యమును వీరరసోచితముగ తిక్కన యిటుల వర్ణించియున్నాఁడు.

రోషంబు భీషణ రూపమై చెలఁగొంద
నతుల కేతువు శిఖయై వెలుఁగ
శరజాలములు పటుజ్వాలలై నిగుడ న
ర్కతనూభవోగ్రాగ్ని ప్రజ్వరిల్లు
నుద్ధతి సైపక యుజ్జ్వల దివ్యప
తాక మేఘంబుగా దళిత ధరణి
రథనేమిరవము గర్జనముగ శరపరం
పరలు ధారలు గాఁగఁ బరఁగి యడరె
నర్జునాంబుదం బనన్య సామాన్య స
ముద్యమమున ముఖపయోరుహముల
కాంతి తఱఁగి యపుడు కౌరవ సేనాస
రోవరంబు దీనభావ మొంద.

విరా. పం 105.

అర్జున దుర్యోధనుల యుద్ధవర్ణనమున వీర రసోచితములు, నర్థవంతములు నయిన కల్పనములు గలవు.

భీష్మే తు సంగ్రామ శిరో విహాయ
పలాయ మానే ధృతరాష్ట్ర పుత్రః
ఉత్సృజ్య కేతుం వినదన్ మహాత్మా
ధను ర్విగృహ్యార్జున మాససాద
సభీమ ధన్వాన ముదగ్ర వీర్యం
ధనంజయం శత్రుగణే చరంతం
ఆకర్ణ పూర్ణాయత చోదితేన
వివ్యాధ భల్లేన లలాట మధ్యే

అనువాద మిట్లున్నది.

పులిఁ గోల వేసినట్టి
ట్టుల పురయంబునఁ గడంగు
టయుఁ దద్వత్
స్థలమునఁ గిరీటి రెండ,
మ్ముల నాటఁగ నేసె బొమలు
ముడివడు చుండన్ విరా. పం-183

# "భావాభ్యుదయ కవితల సంగమ స్థానం - అమృతం కురిసిన రాత్రి"

— విద్వాన్ శ్రీ చక్రవర్తుల రామానుజాచార్యులు, ఎం.ఏ.

'విగళిత వేద్యాంతరము, స్వయం సంవేద్యము, అలౌకికము, నియతికృత నియమరహితము, అనన్య పరతంత్రము, హ్లాదకమయము' అనే ఈ విశిష్ట లక్షణాలతో కూడిన రసాన్ని పోషించి, సహృదయుణ్ణి రసహృదయునిగా చేసే నేర్పు ఒక్క కవికే వుంటుంది. కవి తన మనోగత భావాల్ని వ్యక్తీకరించడంలోనే ఈ నేర్పంతా వుంది. మా పుని మనస్సు తమోరజస్సుల సంఘర్షణ వల్ల సత్త్వస్థితికి వస్తుంది (వికారో మానసో భావః) పరగత సుఖదుఃఖాల్ని తనవిగా భావించడం వల్ల ఆ వ్యక్తికి ఒక సంస్కారం ఏర్పడుతుంది. అవిధంగా సంస్కరింపబడ్డ హృదయం నుండి వెలువడే భావాలే రససంపాదకాలూ, రసనిష్యందాలూ అవుతాయి. ఆ కోవలో చేరిన తిలక్ సంస్కారహృదయమే 'అమృతం కురిసిన రాత్రి.'

'ఔచిత్యం రససిద్ధస్య, స్థిరం కావ్యస్య జీవితమ్' అన్న అభినవగుప్తుని అభియుక్తోక్తికి అమృతం కురిసినరాత్రి అన్వర్థం అవుతుంది.

అధునిక యుగంలో వచన కవిత్వ రచన మార్గంలో అద్యగాములు మువ్వురు. వారే శ్రీశ్రీ, చలం, తిలక్ లు. తన మనసులో అల్లిబిల్లిగా వున్న భావాన్ని గేయంగా వ్రాసి గాయాన్ని రేపే శక్తి ఒక్క శ్రీశ్రీకే వుంది. మాటలతో కదను తొక్కించి పదం పాడించగల నేర్పు అతిడి సొమ్ము. ఇక, చెప్పదల్చుకొన్న భావానికి ఎన్ని ఎదురు సంకెలలున్నా ఛేదించి సాక్షిగా అక్షర రూపాన్ని ప్రసాదించగల వచన రచయిత చలం.

వైరెంటినీ స్వాయత్తం చేసుకున్న ఘనత తిలక్ ది. అతని కవితలో 'A rhythemic Creation of beauty' వున్నది. తనదైన ముద్ర తిలక్ కవితలో కన్పిస్తుంది. ఇదే కవిత్వానికి జీవగఱ్ఱ.

వ్యక్తికీ సంఘానికీ అవినాభావం(non-seperation) వుంది. సంఘం వ్యక్తిని వదలి మనలేదు. ఆంగ్లేయ పాలన, జాతీయోద్యమ చైతన్య ప్రభావమూ తెలుగు కవిత్వంలోని అధునికతకు కారణాలు. సమాజంలోని దరిద్రం, హింస, దురహంకారం యివన్నీ తిలక్ లో మానసిక పరిణామాన్ని కలిగించాయి. అభ్యుదయ కవితోద్యమం తిలక్ మనోభావ పరంపర 1938 లో సంధ్య సంకలనం గాను 1962లో 'అమృతం కురిసినరాత్రి' గాను రూపం దిద్దుకొని వెలువడింది.

'అమృతం కురిసినరాత్రి'లో మానవ జీవితాన్ని అన్ని కోణాలనుండి, అన్ని దృక్పథాలనుండీ చిత్రించడం జరిగింది. ఇక కవిత్వంతీరు పరిశీలిస్తే భావ కవితా చ్ఛాయలూ, అభ్యుదయ భావనలూ సంగమించినట్లు తోస్తుంది. శైలి సమీక్ష

---

ఇందు 'పులిఁ గోల వేసినట్లు, అను ఉపమాన మమూలక మైనది. అప్పటికే కురువీరు లందరును అర్జునునిచే నోడింపబడుటచే దెబ్బతిన్న పులివలె దుర్యోధనుఁడు పైఁబడినాఁ డనుట సమంజసము.

అనంతరము దుర్యోధనుఁడు పరాజితుఁడై మరలి తన పురమునకు పోవును.

—0—

రణ విషయంలో 'వందుర్తి' 'అభ్యుదయ కవితాయుగం' గా ప్రవర్తిల్లిన రోజుల్లో అనేకమంది కవులు శైలికీ, అక్షర రమ్యతకూ ప్రాధాన్యం యివ్వనందువల్ల ఆనాక లోపంగా పరిణమించింది. ఈ దోషాన్ని పరిహరించి తిలక్ అభ్యుదయ భావాలకు రమ్యమైన శైలిని సమకూర్చడంలో కృతకృత్యుడయ్యాడు.' అన్న మాటలు యథార్థానికి సాక్ష్యమిస్తున్నాయి.

ప్రారంభంలో 'నాకవిత్వం' లో తన కవిత్వాన్ని గూర్చి కొన్ని వివరాలు యిచ్చాడు.

'నాకవిత్వం కాదొక తత్త్వం
అది కాదు మీ రనే మనస్తత్త్వం'—

తన కవిత్వం కేవలం ఏదో ఒక తత్త్వానికి (రాజకీయ మత తత్త్వాలకు) సంబంధించింది కాదనీ కొన్నిటికే పరిమితం అయ్యే మనస్తత్వం తనది కాదనీ చెప్పాడు.

అదే ఖండికలో

'నా అక్షరాలు కన్నీటి జడులతో తడిసే
దయాపారావతాలు
నా అక్షరాలు ప్రజాశక్తుల వహించే
విజయ ఐరావతాలు
నా అక్షరాలు వెన్నెలలో ఆడుకునే
అందమైన ఆడపిల్లలు'

మొదటిపాదంలో కరుణ హృదయం వ్యక్తమౌతుంది. ఇదే మానవతా వాదం. రెండవ పాదంలో అభ్యుదయ భావనకు ఆవిర్భావం జరిగింది. మూడవపాదంలో భావకవితా లక్షణాలు వ్యంగ్యంగా వున్నాయి. అంతేకాక శైలి విలసనాన్ని కూడా గుర్తుచేస్తుంది,

తన కవితా వస్తువును గూర్చి

'అగాధ బాధా పాథః పతంగాలూ
ధర్మవీరుల కృత రక్తనాళాలూ
త్యాగశక్తి ప్రేమరక్తి శాంతినూక్తి
నాకళా కరవాల ధగద్ధగ రవాలు'—

అంటూ తన కవితా కరవాలానికి ప్రేరకాలూ ఉపస్కారకాలూ అయిన అంశాల్ని తెలిపాడు.

తన కవిత్వాశయాన్ని ఈ విధంగా తెలుపుతున్నాడు.

'నవత_కవిత' అనే ఖండికలో

'కవిత్వం ఒక ఆల్కెమీ
దాని రహస్యం కవికే తెలుసును.
కాళిదాసుకు తెలుసు, పెద్దన్నకి తెలుసు,
కృష్ణశాస్త్రికి తెలుసు, శ్రీశ్రీకి తెలుసు.'
'నువ్వు చెప్పే దేదైనా నీదై వుండాలి,
నీలోంచి రావాలి
చించుకుని రావాలి... ... ,
'కవిత్వం అంతరాంతర జ్యోతి స్సీమల్ని
బహిర్గతం చెయ్యాలి
విస్తరించాలి చైతన్య పరిధి
అగ్ని చల్లినా అమృతం కురిసినా
అందం ఆనందం దాని పరమావధి'

కవిత్వం ఒక ఆల్కెమీ. దాని రహస్యం కవికే తెలుసని అందునా మొట్టమొదట కాళిదాసుకే స్థానం యివ్వడం గమనార్హం. కాళిదాసులోని ప్రకృతి పరిశీలనా, మానవ మానవేతర భావా విష్కరణ నేర్పూ అందుకు కారణం అన్పిస్తుంది. తరువాత పెద్దనను పేర్కొనడంలో భావన ఎంత అభ్యుదయకరమైనా అందంగా వ్యంగ్య విలసితంగా చెప్పకపోతే అది రాణించదన్న అభిప్రాయం అంతర్లీనమై వుంది. ఆవరుసలో కృష్ణశాస్త్రినీ, శ్రీశ్రీనీ చెప్పడం తన భావకవితా ధోరణికి అభ్యుదయ భావాలను జోడించడం తెలుస్తుంది. కవిత్వం అంతరాంతర జ్యోతి స్సీమల్ని బహిర్గతం చెయ్యాలనడంలో తన అనుభూతికీ, హృదయగత భావపరంపరకూ అక్షర రూపం కల్పించాలన్న ఆశయం తెల్లమౌతుంది. అగ్నిచల్లినా, అమృతం కురిసినా అందం ఆనందం దాని పరమావధి. ఇది శాంతి విప్లవ చైతన్యాన్ని ప్రకటితం చేస్తుంది. ఆవేశం + అనుభూతి కల్గిన కవిత్వమే సామాజిక పరిణామాన్ని కల్గించే శాంతిని ప్రతిష్ఠాపిస్తుంది.

ఈవిధంగా తిలక్ తనకవితా నిర్వచనాన్నీ, కవిత్వ తత్త్వాన్నీ, కవిత్వాశయాన్ని, దాని ఫలప్రతిపత్తినీ ప్రకటించడం జరిగింది.

తిలక్ భావకవిత్వంతో అభ్యుదయ భావాన్ని ఎలా సమ్మిశ్రితం చేశాడో పరిశీలింప దగింది.

భావకవిత్వం : తిలక్ పై ఆంగ్ల కాల్పనిక్ వాద (Romanticism) ప్రభావం ఎంతైనా వుంది. అందువల్లే ఆయన కవితలో హైందవ, పాశ్చాత్య సంప్రదాయ ప్రభావంచోటు చేసుకుంది.

హైందవ సంప్రదాయ ప్రభావం :—

'నా కవిత్వం' అనే ఖండికలో

'నా అక్షరాలు ప్రజాశక్తుల వహించే
విజయ ఐరావతాలు
నా అక్షరాలు వెన్నెలలో ఆడుకొనే
అందమైన ఆడపిల్లలు'

ఈ పాదాల్లో విజయ ఐరావతాలు, వెన్నెలలో ఆడుకొనే అందమైన ఆడపిల్లలు అనే మాటలు హిందూ సంప్రదాయాన్ని తెలుపుతున్నాయి.

ఇలాగే 'ముసలివాడు' అనే ఖండికలో కాటికి కాళ్ళు చాచుకున్న ముసలివాని స్థితిని వర్ణిస్తూ,

'నాకు కలలో కన్పించు డాక్టరు
ప్రేతసోక్రటీసు.
విరిగిన పాతు మెడ, దున్నపోతుల'

మరణానికి ప్రతీక యముని వాహనం దున్నపోతు. ఇది హైందవ సంప్రదాయ భావన.

ధర్మరాజా! ఇక అరణ్యావాసం నీవగతి
'దుర్యోధనసార్వభౌమా
ద్రౌపది నీకుఖైదు'

ఈ మాటలు 'కాయ్ రాజా కాయ్' అనే ఖండికలోనివి. ఇది హైందవసంప్రదాయ భావనా ధోరణికి చిహ్నం.

'దీపం' అనే ఖండికలో

'ఏడమ్ అండ్ ఈవ్ లు చేసిన పాపం
ఇలపై వెలిగించిన తొలిదీపం' ఈ మాటలు పాశ్చాత్య సంప్రదాయ భావనకు తార్కాణం.

భావకవిత్వంలో ప్రణయ తత్త్వాన్ని తిలక్ ఆవిష్కరించాడు.

'నిన్ను నన్ను బలహీనులనీ,
ఎక్కిపిస్తులనీ నిందిస్తుంది
ఊపిరాడక గిజగిజలాడే ఈలోకం
ఎవరెట్టుకన్నా ఎత్తైన నా ఊహా
శిఖరాన్ని వీళ్లెక్కలేరు.
సిందూరం కన్నా ఎరుపైన నాహృదయాన్ని వీళ్ళు చదువలేరు.'

ఈ పద్ధతిలో నడచిన భావకవిత్వంలో పలాయన వాదాన్ని ద్యోతకం చేయుడం తిలక్ ప్రత్యేకత.' నా అనుభూతివాద ... దాన్ని నేను ఆవిష్కరిస్తాను' అని చెప్పి తన అనుభూతిని భావకవిత్వ రూపంలో ఆవిష్కరించాడు తిలక్.

ప్రకృతి కవిత్వం :-

సంజె పెదవుల ఎరుపు కడలి అంచులవిరిగి
సంజ పరికిణి చెరగు ఎడదలోతుల మెరసి
ఏటికొంగల నిదుర ఎఱ్ఱగా ప్రాకింది.
బాతురెక్కల నీడ బరువుగా సాగింది.'

ఇది తిలక్ 'ప్రకృతి' పరిశీలన జ్ఞానానికి నిదర్శనం

భావసవ్యత :- 'అమృతం కురిసిన రాత్రి' అనే ఖండికలో

'జలజల మని కురిసింది వాన
జాల్వారింది అమృతంపు సోన
దోసిళ్ళతో పట్టి త్రాగి వచ్చాను.
మృత్యువునీదుఃఖాన్నీ వెళ్ళిపొమ్మన్నాను'

ఈ భావన మధురమయింది. అమృతంపు సోన దోసిళ్ళతో పట్టి త్రాగితే దుఃఖాలూ, చావూ తొలగిపోతాయన్న శుభాశంసన ఇందులో ఇమిడివుంది.

అభ్యుదయ భావన :- ఇందులో అభ్యుదయవాదం, మానవతావాదం, అనుభూతివాదం, శాంతి కాముకత్వం మొదలైనవి తిలక్ సాధించిన అంశాలు.

'ఇప్పటికీ దిగులు నీరునిండిన కోటి
మనస్సరస్తీరాల నాకవిత
కోరికల కోణారకారపు
క్రొత్తచెట్లను నాటుతుంది.'

క్రొత్తచెట్లు నిరంతరం పెరిగేవి. కోణాకారపు క్రొత్తచెట్లుఅనడంలో అభ్యుదయ భావన వుంది. కోణాకారం ముందుకు పొడిచుకొని వచ్చే దుఃఖం వంటిది. ఇదే అభ్యుదయ భావన.

'తపాలా బంట్రోతు' అనే ఖండికలో

'ముసలి దానికి మంచి వార్త నందించు
ముడుతలు పడిన ముఖంమీద
ఆనందాన్ని పలికించు'

ముఖం సమాజానికి దర్పణం. మధ్యతరగతి ప్రజాజీవనం ఆముఖ లోని ముడుతలు. ఆముఖంమీద ఆనందాన్ని పలికించమని కోరడం అభ్యుదయ భావం.

'ఆర్తగీతం' అనే ఖండికలో

'నేను చూశాను నిజంగా ఆకలితో
అల్లాడి మర్రిచెట్టు క్రింద
మరణించిన ముసలి వాణ్ణి .......
నేను చూశాను నిజంగా మూర్తీభవత్
దైన్యాన్ని హైన్యాన్ని
క్షుభితాశ్రు కల్లోల నీరధుల్ని
గచ్ఛత్ శవాకార వికారుల్ని
ఇది ఏనాగరికతకు ఫలశ్రుతి?
ఏవిజ్ఞాన ప్రకర్షకు ప్రకృతి ?
ఏబుద్ధదేవుడి జన్మభూమికి గర్వస్మృతి?

ఈగేయం తిలక్ సామాజిక అవగాహనను అవగతం చేస్తుంది. విశృంఖలంగా వున్న హైన్యానికీ దైన్యానికీ తిలక్ అక్షరాకృతి కల్పించాడు.

పాశ్చాత్య దేశాల్లో ని 'Humanism' బ్రహ్మసమాజ మత మను పేరుతో ఆంధ్రదేశంలో ప్రచారమయింది. ఆకారణంగా 'వసుధైక గీతం' లో

'సంకుచితమైన జాతిమతాల సరిహద్దుల్ని
చెరిపివేస్తున్నాను నేడు
అఖండితమైన మానవీయ పతాకాన్ని
ఎగురవేస్తున్నాను చూడు.'

ఈగేయం జాతిమత నిర్మూలనం ప్రాతిపదికగా సాగింది. దీనితో మానవతా వాదం ప్రతిష్ఠితమైంది.

'పిలుపు' అనేఖండికలో

'కాలం విరిగిన బండిచక్రంలా
కదలలేక పడిపోతే
మొండిచేతుల మానవత్వం
తెల్లబోయిన దీనదృశ్యం'

దీనితో మానవతావాదం పతాకస్థాయిని చేరుతుంది. తిలక్ సాధించిన వాటిల్లో శాంతి విప్లవచైతన్యం ముఖ్యమయింది.

'యుద్ధాల్ని సృష్టించే మహా నాయకులు
దేశాల సరిహద్దులలో నిలబడి
ద్వేషాల శతఘ్నుల్ని పేలుస్తున్నప్పుడు
అకాల మరణం పొందిన అనాథ బాలుణ్ణి
ఒడిలో పెట్టుకొని
అతగాడు ఎర్రని కళ్ళతో
ఏమీ ఎరుగని దేవుని ప్రశ్నిస్తున్నాడు.'

ఈ ఖండికలో యుద్ధ విముఖత్వం, శాంతికాముకత్వం స్పష్టమౌతుంది.

అభ్యుదయ భావనకు రమ్యమైన శైలి సమీకరణ చేయుడంలో తిలక్ కృతకృత్యు డయ్యాడు.

'ఆర్తగీతం' అనే ఖండికలో

'నిక్రొత్త సింగారమ్ము వలదు ఉదాత్త
సురభిళాత్త శయ్యా సజ్జితమ్ము వలదు
రసప్లావితము వలదు.'

ఈ గేయం ప్రబంధవర్ణనల ధోరణిలో సాగింది. ఈ రమ్యమైన శైలి సమీ

కరణ తిలక్ అభ్యుదయ భావానికి పుష్టి నిచ్చింది.

'న్యూసిలబస్' అనే ఖండికలో
'మాలిన్యం మనసులో వున్నా
మల్లెపువ్వులా నవ్వగల్గడం
ఈనాటి తెలివి.'

'శిఖరారోహణం'లో

'కాలం జాలం లాంటిది
కళ్ళుమూసుకొని నడిస్తే
ఊచ్చులో పడతాడు
శక్తిపరుడు యుక్తిపరుడు
దాన్ని ఛేదిస్తాడు.'

ఈ అభివ్యక్తిలో తిలక్ ప్రకృతి అవగాహనా, మన స్తత్వ పరిశీలన జ్ఞానమూ అర్థమవుతున్నాయి.

చివరిగా

'అతులాది దేవుళ్ళనుండి
వారిపూజారుల నుండి
వారి ప్రతినిధుల నుండి
దేవుడా! రక్షించు నాదేశాన్ని'

అంటూ భగవంతునికి తన అభ్యర్థనను 'ప్రార్థన' అనే ఖండికలో తెలిపాడు. తిలక్ దీనిలో తనదైన ముద్రను నిలిపి తన కవిత్వానికి భరతవాక్యం పలికాడు.

వ్యక్తులనూ, సంస్థలనూ, రాజకీయ వ్యవస్థలనూ సమాజ శ్రేయస్సువైపు మళ్ళించడమే కవిత్వధ్యేయం. తిలక్ తన కవిత్వ దృష్టిని సాంఘికాభివృద్ధిపై కేంద్రీకరించాడు. 'అపారేకావ్య సంసారే, కవిరేవ ప్రజాపతిః; యథాస్మైరోచతే విశ్వం, తథేదం పరివర్తతే' అనే ఆనంద వర్ధనుని లక్షణానికి తిలక్, అతని 'అమృతం కురిసిన రాత్రి' లక్ష్యం అయ్యాయి.

శ్రీశ్రీ అన్నట్లు 'కవితాసతి నొసట నిత్యరస గంగాధర తిలకమే' మన బాల గంగాధర తిలక్.

## అనుభూతి

— శ్రీ రామడుగు వెంకటేశ్వరశర్మ.

* 'ఉదయశ్రీ' యై యమ్మ, త్వదనమునంగున కృపారసశ్రీ లోలుకన్
విదితమ్ముగ 'విజయశ్రీ'ల్, గుదురుకొనియె నీదుకావ్యకోమలిధరణిన్
* నుతులై, తీయని సదలం, కృతులై, గంగాతరంగరింగణ విలస
ద్గతులై' వాణీవీణా, శ్రుతులై నీభవ్యకృతులు శోభిలు జగతిన్.
* కలువలు పూచినట్లు, చిఱుగాలులు వీచినయట్లు, బోసిన
వ్వులసిరి బాపుజీ యొలుక బోసినటుల్, మధురామృతంబు జా
బిలి వెదజల్లినట్లు విరి వెన్నెలవన్నెలఁ జిల్కినట్లు, కో
యిలకలగానమాల వెలయించినయట్లు, వసంతయామినుల్
పులకలు దేరినట్లు విరబూచిన జాజులు మోజులై పరీ
మళ మెలయించినట్లు, సుమమాలలడోలలఁదేలినట్లు, మం
జులమగు వేణుగానమున సోలినబృందకళింద జానదీ
సలిలములందుఁ దానములు సల్పినటుల్, సిగపూలు రాధతోఁ
గలకలనవ్వినట్లు, కడు కమ్మగ నాఁడవనూయ జోలపా
టలు మురిపించినట్టులు తడంబడ మెట్లను కుంతిపాలబు
గ్గలపసివాని నెత్తుకొని గంగదెసన్ దిగివచ్చినట్టు, లూ
ర్మిళ యనురాగ జీవలహరిన్ వని వెన్నెలఁ జేసి లక్ష్మణున్
వెలుగులఁ దేల్చినట్టు, లెద విందులు చేసెడి కన్నెకోరికల్
తలుపులుతీసిన ట్లభినుతమ్ముగ నర్తకి 'ఘల్లు' మంచు నం
దెలఁకదలించి నట్లు, తియ తేనియ లానినయట్లు, జాలి బా
టలవిరులెల్ల బుద్ధునికడాని వరాల వరాల జల్లు న
వ్వులగుచు మోవిపై మురిసి పోయినటుల్, మురిపాల తేనిము
ద్దుల చెలి 'మాయ' దివ్యకళఁ దోగి కలన్ దులదూగినట్లు, మై
థిలి యెదయందు పొంగు తరి తీపుతలంపులె మాలయౌచు భా
సిలి కరమందునన్ బరవశించి నటుల్, పరమేశుకై సుమాం
జలి చెవియందుఁ జెందొవయు జాఱఁగ గౌరి యొసంగినట్లు, గు
వ్వలవలె జంట మింటనెల బాలుని గైకొనినట్లు, సత్య చూ
పులకును గంపు సొంపులని పొంపిరి పోయినటుల్, రసాలముల్
లలితరసాకృతిన్ గవి కలమ్మునఁ జిందులువేసినట్లు, పా
పలకయి తల్లి ముద్దలిడి పాలబువందనిపించునట్లు, చ
క్కిలిగిలి భాస్కరుండొసఁగ కిల్కిల పద్మిని నవ్వినట్లు, ప
ల్కులకులుకుల్ వెలార్చ నతి లోకనుతంబగు నీ కవిత్వముల్
తొలకరి జల్లుల ట్లెదకుఁ దోఁచునుగాదె! పఠించు వారికిన్.

# జాలిగుండె

— శ్రీ జయంతి వేంకటశాస్త్రి.

అదియొక చిన్ని మేక కడుపారఁగ పచ్చిక మేసి హాయిమై
మృదుల పదంబుల న్నులుకలేయుచు దిగ్గెడి దేమిహేతువో
కదలక మూల్గుచుండె, జనకాండము దానిని లక్ష్యపెట్ట దా
యొదగల బాధయేమొ వచియింపఁగ నేరని మూఁగజీవమై.

చెవులెత్తున్ తను జూచి సాయపడి రక్షింపంగనైవచ్చుసా
ధువులేతెంచిన జాడగాఁగ, పరువెత్తున్ కొంతదూరంబు పెన్
రవళిన్ గొంతెగలించి యార్చు మదిశాంతంబింత చేకూర కా
నవజీవంబు సమీపగ్రామజనహృన్నాళీకముల్ భేదిలన్.

కొండొక మేక గ్రామమునకున్ సరిహద్దగు కానలంబులో
చండతరాకృతిన్ చదుప చచ్చెను వ్యాఘ్రముచేత నన్నయు
ద్దండపు వార్తలున్ చెవికి దాకినవాడగు రాజుగుండెకున్
మెండుగ నాటె మేషకృత భీతగళస్వన మొక్కపెట్టునన్.

మురిపెముతోడ తెల్పు నలుపుంగల చిన్ని కుమారు లిర్వురున్
చేరియొకప్రక్క గంతులిడ క్షీరముగ్రోలఁగనెంచువారి, నే
మరచి తొలంచినట్టి యజ మా యది, యండలిబిడ్డ తల్లికై
యరచెడి నిట్లుగా ననుచు నాగిన యాతని కాత్మదోచినన్.

జాలిమెయి కూనఁ జేకొని
రాలను రప్పలను దాటి లాలితమతినా
బాలుఁడజార్భక మాదటఁ
బాలింపఁగ నిట్లు చేరె పరమప్రీతిన్.

ఆ మెదువైన గుండెకద లాడెను కొండొక స్మారకంబుగా
ప్రేముడి కన్నతల్లి సరి రెండగునేండ్లకు బూర్వమందు వి
శ్రామ సుఖంబుగా విధివశంబున తన్నును జేసి యంతస్వ
ర్ధామము చేరె నన్నవితతంబగు దుఃఖపుటూహ లీలమై.

జనని గతించినట్టి తొలిజాడలు మాయని రోజులందు తిం
టినొ తిన కుంటినో యెఱుఁగ నేరను, శత్రువు వెంటనంటుచో
తనువును గోరి పారెడి విధంబున నా పదియేండ్లయీడునన్
జనితిని దిక్కుగానక యజార్భక మాఁగతికయ్యె దుఃఖియై.

సాగెను కొంతకాలమటు సాయముగా ప్రతిసంధ్య యందు సే
వాగరిమంబునన్ గఱిక లాకులు దెచ్చి యొసంగి మేపుటన్
తీగలుసాగె మైత్రి విడఁదీయఁగ నోపని రాగబంధమై
యాగతసౌఖ్య సంపదగ నయ్యజ పోతముతోడ రాజుకున్.

మేకను సేవగించుకొను మిక్కిలిగా, నిజబంధులెవ్వరున్
వీక కనుంగొనంగ పృథివీతలమం దొకరుండు లేఁడ యీ
లోకము వీడినట్టి రిక రూఢిగ నిత్యము సాయమైన 'సా
రా' కనువిందుసేయు పెర లక్ష్య మదేలను రాజు తండ్రికిన్.

పొరుగుగ్రామము వీడి ప్రొద్దుపోవఁగ పురపురనడచి
యరుదెంచు రాజుకు బాటనడుమను నరయ క్రీనీడ
మరచె నెమ్మేను తండ్రియు త్రాగి, ఇమ్మాడ్కి నీతడును
చొరవజేసెనొ యేమొ మేక నమ్మఁగ సొమ్ముకై తోడరి.

క్రూరుడు తండ్రియంచనఁగ గూడునె? మత్ప్రియవస్తు
నాశమున్
గోరునె మానవత్వ మెద గూడినవా డత డయ్యె నేని? లో
నారయ నెద్దియేన్ మిగిలె నా తనవన్న వనేక ప్రశ్నముల్
దారున వేచె పుత్రు వితతంబుగ తండ్రిని గూర్చి తన్మదిన్.

తెలతెలవారుచుండ రవి దీప్తి యొకింతగ సాగు నంతకున్
చలితమనంబు నిబ్బరము సంతరణం బొనరింప రాజు దు
స్తుల గొని గేహము న్విడిచి దూరపథంబు జనంగ నేగె కా
గల తన భాగ్యరేఖల వికాసము సర్వము దైవదత్తమై.

— ••• —

# శ్రీనాథుని సమాస పరిశీలనము

— శ్రీ డా. నేతి అనంతరామశాస్త్రి, ఎం.ఏ., పిహెచ్.డి.

( గతసంచిక తరువాయి )

1.3 3 ద్విగువు :- ఈసమాసమునందు సంఖ్యా విశేషణము పూర్వమందు వచ్చును.

ఇరు - కేలు [ కాశీ 5 195 ]
ఏను - కోసులు [ భీమ 2.88 ]
నల్గడలు [ హర 7.170 ]
నాలుగు - మోములు [ శివ 1.3 ]

2. కొన్నియెడల పరపదాది న వర్ణము పూర్వ పదాంత్య హల్లుతో కలిసి దానికి వికారము కలిగించును.

మున్నాలు [ శృం.నై 6.72 ]
నన్నూలు [ కాశీ 5.192 ]

3. ఒక, ఒక్క అను సంఖ్యలు విశేషణములుగను. ఒక్కడు, ఒక్కటి అనునవి నామ రూపములుగను ప్రయోగింపబడుచున్నవి.

ఒక, ఒక్క అనునవి మొందటి అవయవముగా గల సమాసములు.

ఒక - కత్తుక [ హర 2.60 ]
ఒక్క - కందేలు [ శృం.నై 8.183 ]
ఒక - చాయ [ శివ 3.78 ]
ఒక్క - చోద్యంబు [ కాశీ 3.113 ]

4. రెండు అను రూపమునకు విశేషణము 'ఇరు'

ఏకవచనముగ :-

ఇరు - చక్కియ [ హర 7.40 ]
ఇరు - గేలు [ కాశీ 5.195 ]
ఇరు - చెవి [ భీమ 4.50 ]

బహువచన ప్రత్యయముకలిసి:-

ఇరు - పూటలు [ శృం.నై 5.74 ]
ఇరు - గెలఁకులు [ కాశీ 5 286 ]

5. 'ఇరు' నకు 'నమ'లు పరమైనపుడు 'ఇను' ఆదేశముగా వచ్చును.

ఇను - మడి [ శృం.నై 5.23 ]
ఇమ్మడి [ హర 7.144 ]
ఇను - నూఱు [ హర 4 60 ]
ఇన్నూఱు [ శృం. నై. 6.72 ]

6. మూఁడు అనురూపమునకు విశేషణము 'ము'. ఏకవచనమున :

ముచ్చిచ్చు [ భీమ 3.37 ]
ముప్ప్రొద్దు [ శృం. నై 6.142 ]

7. నాలుగు అనురూపమునకు విశేషణము 'నలు'.

ఏకవచనమున :-

నల్దిక్కు [ శృం. నై 7.88 ]
నల్గడ [ కాశీ 3.105 ]

1.3.4. బహువ్రీహి :- ఇది అన్యపదార్థ ప్రధానము. తారతమ్య పరిశీలనము చేయగా బహువ్రీహి సమాసములు శ్రీనాథుని భాషలో తక్కువ. వానిలో కొన్ని సంస్కృత రూపములతో పోలియున్నవి.

'బోఁడి' అనుపదము రెండవ అవయవముగా గల సమాసములు నన్నయ భాషలో లేవు. నన్నెచోడునిలో 'తలిరుఁబోఁడి [కు.సం 5.135 ] అని ఒకే ఒక ప్రయోగము కలదు. కాని శ్రీనాథునిలో గల బహువ్రీహి సమాస సామస్త్యము నిట చూపుదును.

అలరుఁబోఁడి [ హర 4.83 ]
ఇరుగుఁ బోఁడి [ కాశీ 3.41 ]
ఎలదీఁగఁబోఁడి [ శృం.నై 8.178 ]
ఏనికమోముతాల్పు [ భీమ 1.2 ]
కొండవిల్లు [ భీమ 4.46 ]
కొండరాచూలి [ హర 4.17 ]
క్రొన్నెల పువ్వుతాల్పు [ భీమ 2.117 ]
చిగురుఁబోఁడి [ కాశీ 6.265 ]
తలిరుఁబోఁడి [ కాశీ 2.117 ]
తమ్మిపూఁచూలి [ శృం.నై 2 138 ]
తీఁగఁబోఁడి [ కాశీ 7.137 ]
నలువ [ భీమ 3.186 ]
ననవిల్తుడు [ భీమ 3.212 ]
పూఁబోఁడి [ శృం.నై 8,40 ]
ముక్కంటి [ శృం.నై 8.201 ]
మచ్చెకంటి [ హర 7.127 ]
మెఱుంగుఁబోఁడి [ కాశీ 3 23 ]

2. ఈక్రింది సమాసములలో నుత్తర పదములందు వికారము కలిగినది.

ముక్కంటి [ కాశీ 2 44 ]
నలువ [ భీమ 3.186 ]
తొలకరి [ హర 4 47 ]
కొండరాచూలి [ హర 4 16 ]

1.3 5 ద్వంద్వము :- ఉభయ పదార్థ ప్రధానము ద్వంద్వము. సహజముగ నిది బహువచన ప్రత్యయము కలిగియుండును.

అన్నదమ్ములు [ భీమ 1.33 ]
అత్త - మామలు [ శృం. నై 7.9 ]
తల్లి - దండ్రులు [ కాశీ 3.330 ]
పాలు పెరుగు గోగిరంబులు [ హర 6.56 ]

2. ద్వంద్వ సమాసమున రెండవ అవయవమైన 'పా'కు 'వా' రావుండుట. ఈక్రింది ప్రయోగము గలదు.

ఆటపాటలు [భీమ 5.41]

3. ద్వ్యర్థక శబ్దములతోడను కొన్ని యెడల ద్వంద్వ సమాసములు కలుగ వచ్చును.

వినీ వినని భంగి [శృ.నై 6.33]

4. సముచ్చయార్థకమునకు బదులుగా దీర్ఘము వచ్చిన ప్రయోగ మొకటి శ్రీనాథుని రచనయందు కలదు.

చల్లాయంబలిద్రావితిన్ [చా.మం 1.119]

1-4-1 శ్రీనాథుని రచనలలో ఈక్రింది సమాసములందలి ఉత్తర పదము అవ్యయప్రతిరూపక విశేష్యముగా నున్నది.

తలక్రిందు [కాశీ 3.152]
ఊరువడి [కాశీ 6 227]
వెంబడి [భీమ 4 60]

2. ఈ క్రిందివానియం దుత్తరపదము ద్వ్యర్థకరూపమై విశేష్యార్థమును కలిగించుచున్నది.

రేపాడి [కాశీ 2.83]
ఎల్లుండి [కాశీ 7.74]

3. ఈ క్రిందివానియం దుత్తరపదము ద్వ్యర్థకరూపమై యవ్యయములను కల్పించుచున్నది.

ఇటుఁబట్టి [శృ.నై 3.144]
కాఁబట్టి [హార 1.15]
కనుకని [కాశీ 2.17]
పదంపడి [శృ.నై 4.80]

4. ఈ క్రిందివాని యందుత్తర పదము తుమున్నర్థకమై యవ్యయములను కల్పించుచున్నది.

ఎడపఁదడప [కాశీ 4.85]
క్రచ్చుఱ [కాశీ 6.236]

5. ఈ క్రింది ఆమ్రేడిత సమాసములు ఒక వ్యాపారమునకు పునః పునరాగతమును, ఆధిక్యమును సూచించుచున్నవి. ఇవి కేవలము నామములే కాక, విశేషణ, క్రియా విశేషణ, అవ్యయములుగ వచ్చును.

తరువందరువ [హార 6 62]
ఎదురు కెదురు [భీమ 4.12]
అచట నచట [శృ.నై 125]
అల్లనల్లన [శివ 4.40]
అంచెలంచెలు [కాశీ 1.132]

6. ధ్వన్యను కరణ నిర్మాణమున పునరుక్తి సహజము.

కలకల [శృ.నై 7.156]
గనగన [హార 4.14]
జవజవ [కాశీ 5.119]
పుటపుట [భీమ 3 222]
సొటసొట [క్రీడా 229]
విసవిస [శృ.నై 1.72]

7. విలక్షణార్థకమై ఒకేపదము పునరుక్తమై సమాసముగా నగుటయు కనుపట్టును.

ఒండొండ [కాశీ 3.235]

1-5-0 శ్రీనాథుని భాషలో నీక్రింది సమాసములు విశిష్టములగుటచే వేరుగా ప్రదర్శింప బడుచున్నవి.

1. అర- మొదటి అవయవముగా గల సమాసములు.

అర-గొను [శివ 2.21]
అర-కన్ను [కాశీ 7.70]

2. అడు- మొదటి అవయవముగాగల సమాసములు :

అడు-మోవి [శృ.నై 5.28]
అడుగొడుగు [హార 3.38]

3. ఎల- మొదటి అంశముగా గల సమాసములు.

ఎలఁదోఁట [భీమ 3 36]
ఎలప్రాసఁగుటడుక్కులు [హార 2.91]

4. ఎదురు- మొదటి అంశముగా గల సమాసములు.

ఎదురు గద్దియ [శృ.నై. 4.97]
ఎదురుచుక్క [కాశీ 7.217]

5. కడు- మొదటి అంశముగా గల సమాసములు.

కడగన్ను [శృ.నై 7.41]
కడకొమ్ము [భీమ 4.134]

6. కన్నె- మొదటి అవయవముగా గల సమాసములు.

కన్నెపువ్వు [శృ.నై 1.92]
కన్నెకొర్మ [శృ.నై 1.86]

7. జమిలి- మొదటి అంశముగా గల సమాసములు.

జమిలిపాములు [హార 5.5]
జమిలి మండెగలు [శ్రీ.నై 6.121]

8. తండము - రెండవ అంశముగా గల సమాసములు.

త్రివ్వి తండము [క్రీడా 256]
కంకాళతండము [కాశీ 3.138]

9. తరఁగ - మొదటి అంశముగా గల సమాసములు.

తరఁగ దండు [హార 7.80]
తరఁగలవడి [హార 6.90]

10. తరి- మొదటి అంశముగాగల సమాసములు.

తరికొండ [హార 6.76]
తరిత్రాడు [శృ.నై 5.63]

11. తల- మొదటి అంశముగా గల సమాసములు.

తలపువ్వు [శృ.నై 8.201]
తలచీర [కాశీ 1.139]

12. నడు - మొదటిఅంశముగా గల సమాసములు.

నడుత్రోవ [భీమ 4.181]
నడుచుక్క [హార 1.3]

13. పెడఁద- మొదటి అంశముగాగల సమాసములు.

వెడఁద-కన్ను [ భీమ 6 69 ]
వెడఁద_నోళ్లు [ చా.మ 1.131 ]

1-6-1 సిద్ధ సమాసము సంపూర్ణ రూపము వైకృత మయినపుడు సమాస మందలి పూర్వపదమునకు తెలుగున వ్యస్త ప్రయోగము లేదు.

అడియాస [ కాశీ 20111 ]
అంతిపురము [ శృ.నై 7,145 ]
గండ్రగొడ్డలి [ శివ 4.29 ]
పరుసవేది [ భీమ 2.144 ]

2. పూర్వపద మాపవిభక్తిక మగుచో దాని యాపవిభక్తిక రూపము నిలుచును.

మునికోల [ కాశీ 3 225 ]
వింటిజోదు [ శివ 3.53 ]

1-6-2 తెనుగున రెండు మూడు పదముల కలయికచే ఏర్పడు సమాసములే ఎక్కువ. అంతకంటె ఎక్కువ పదములతో ఏర్పడుట అసహజము. కాని సంస్కృతమున అట్టివి చాలఎక్కువ. శ్రీనాథుని భాషలో అవయవ నిర్మాణము ననుసరించి సమాసములను అయిదు విధములుగా విభజించుట యైనది. అందు రెండంశముల సమాసములు 2135.

ఉదా: ముద్దుఁగూన [ హర 4 6 ]
వేల్పువెజ్జు [ భీమ 4.96 ]

మూడంశముల సమాసములు 549.

ఉదా: అలరువింటిజోదు [ శృ.నై1 94 ]
సింగిణివింటికొప్పు [ భీమ 5 96 ]

నాలుగంశముల సమాసములు 127,

ఉదా: అనువగు కాను దీఁగెలు [ భీమ5.104 ]
నున్నని నీరుకావిదోవతులు [ శివ 3.112 ]

ఐదంశముల సమాసములు 28

కన్నెక్రొత్తాకులు మెఱుఁగుఁదీగ [ శృ.నై 3.88 ]
వడఁకుగుబ్బలి కూఁతు కొడుకుపట్టి [ కాశీ 1.2

ఆఱంశముల సమాసములు : 3

జగ_జెట్టి_పాప_జేని - యా_దల [ భీమ 5.9 ]
వడఁకు_గుబ్బలి_రాచ_వారి_కూరిమి_కన్య [ కాశీ 4.140 ]

శ్రీనాథుని కృతులలో ఉన్న సమాస సామస్త్యము 3842. అందు ఆఱు అవయముల సమాసము పెద్దది.

ఉపయుక్త గ్రంథములు


1. Suryanarayana, J. - A study of Telugu compounds, S. V. University, Tirupathy, 1966.

2. అనంతరామ శాస్త్రి, నేతి : శ్రీనాథుని భాష - వర్ణనాత్మక విశ్లేషణము. అముద్రిత గ్రంథము.

3. అథర్వణాచార్య: వికృతివివేకము (లేక) అథర్వణకారికావళి. *


సంకేత పదవివరణము

కాశీ:- కాశీఖండము
క్రీడా:- క్రీడాభిరామము
చా.మ :- చాటుపద్య మణిమంజరి.
ప.వీ :- పల్నాటి వీరచరిత్ర
భీమ :- భీమఖండము
వీథి :- వీథి (క్రీడాభిరామము)
శివ :- శివరాత్రి మాహాత్మ్యము
శృ. నై. శృంగార నైషధము
శృం. శ్రీ :- శృంగార శ్రీనాథము
శ్రీ.శృం :- శ్రీనాథుడు శృంగారియా
హర :- హరవిలాసము
హర. పీ. హరవిలాస పీఠిక.

--...--

## సరసోత్సాహం"

— శ్రీ కమల్

ఎందుకు నా మనఃకుహర
మీవు కలంచగ వచ్చినావు నీ
క్రొందలిరాకు మోవి రుచి
కొంచెము చూపు రసజ్ఞనేరవా?
సుందరసంధ్యలో సాగను
శోభల సొంత మొనర్చి కొంటివే?
మందమరాళగామిని ! సు
మాంజలి కూర్తు నను గ్రహింపుమా.

నెచ్చెలి వేగరమ్ము రమ
ణీయ మనోహర భావలాహిరీ
నిచ్చు కథావినోదముల
నీప్సితరీతి వచింతు సౌఖ్యమై
వచ్చె సుఖాళిచ్చు రస
బంధువు నవ్యవసంతమల్లదే
నచ్చినరాగ మాధురుల
నవ్వుచు పోదము రమ్యలోకముల .

పల్కుట నచ్చదా? మధుర
భావ విరాజిత నీదు మేనిలో
పుల్కల వెందుకే? పుడమి
బోధలు నెవ్వరు నేర్పరీ కళల్
చిల్కలు హంసలై ప్రణయ
జీవన నందనసీమ పోదమా
పల్కుచు నాడుచున్ కుసుమ
కోమలి ! జన్మఫల మ్మదే సుమా !

రాగరంజిత లీలల రమ్య రజని
రసవథూకర సంస్పృష్ట రక్తివోలె
మానసోత్తేజమును
గూర్చి మరలు రేఁప
హృదయకుహారాన ఊహాలే
అదనమయ్యె !

## విద్య

— శ్రీ బట్లూరి రామచంద్రయ్య.

ఆదిమధ్యాంతాలు లేనిది విద్య
అభ్యసించి వదలుకోకు మధ్య
అది నునుగడకే ముప్పు తెచ్చే మిథ్య
చదువుకున్నావో నీ వొక బృహస్పతివి
నీ చెప్పుచేతులలో నడచు సరస్వతి
నీ విజ్ఞానసంపత్తిచే వెలిగిస్తావు జ్యోతి
మృత్యువుకు సైతం నినుచూస్తే భీతి
ప్రబోధిస్తావు ప్రజానీకానికి నీతి
నీ వ్యక్తిత్వానికి జగతిచ్చు హారతి
అదే తరతరాలకు తరగని ఖ్యాతి
అభ్యున్నత దేశప్రగతికి నీవో శక్తి
క్రొత్త ప్రయోగాలు చేపట్టడం నీభుక్తి
ఆరని వెలుగై లోకానికి నీచే కలుగుముక్తి
అదే దేశంకోసం నీ వర్పించే రవ్వంత
భక్తి.

—0—

మల్లెలు విచ్చినట్లు, నవ
మంజుల రావముతో విపంచికల్
కొల్లలు మీటినట్లు లెల
కోయిల పాటలహాయితో చె నీ
ఉల్లము తెల్పుచున్ మధువు
లొల్కెడి నవ్వులలో వినోదినీ!
చల్లని మాటతో మదికి
శాంతిని గూర్చుము సౌమ్యరూపిణీ!
జీవన రాగ మాధురిని
చేకొని వచ్చిన దివ్యమోహినీ!
భావసుధా తరంగిణుల
బంగరువన్నెను గూర్చినావు, ఏ
పావనమౌ తపస్సులవి భాగ్యములై
ఫలియించి వచ్చెనో
నీవు నిరంతరమ్ము సుఖ
నేత్రివి నా హృదయైక సత్సఖీ!

—...—

## 'అండపిండ బ్రహ్మాండాలు'

— శ్రీ కపిలవాయి లింగమూర్తి, ఎం. ఓ. ఎల్.



వైదిక వాఙ్మయం పరమేశ్వరుని అనంత కోటి బ్రహ్మాండనాయకు డని స్తుతిస్తే పురాణవాఙ్మయం విశ్వవ్యాప్తమైన అతని లీలను కొంత కొంత పుక్కిటబట్టింది. కాబట్టి పురాణపాఠకులకు ఆయా గాథల స్థలకాలపరిచయాలకు స్థూలంగా కొంత బ్రహ్మాండ పరిజ్ఞానం కూడ అవసరం.

మహానారాయణోపనిషత్తు విరాట్పురుషుని రోమకూపాలలో అనంతకోటి బ్రహ్మాండా లున్నాయని, అవి అతని చేతిలో కరతలామలకాలుగా తిరుగుతున్నాయని వర్ణించింది. బ్రహ్మాండాల్లో ఒక్కొక్కటి తప్తకాంచన వర్ణాభమై కుక్కుటాండాకారంగా ఉంది. వానిలో ప్రస్తుతం మనముండే బ్రహ్మాండ పరిధి యిరవై వేలకోట్ల యోజనాలు. ఈ అండానికి భిత్తిగా మహదాది భూపర్యంతం ఏడు పొర లున్నాయి. అండమధ్యంలో మేరువు నిటారుగా నిలిచి ఉంది. దానికి పైభాగంలో నాలుగుశిఖరా లున్నాయి. ఈ మేరువుకి రెండుకొనలపై త్రిఖండ సోపానస్థలాలు వానిపై నిరాలంబ ప్రదేశాలు ఉన్నాయి. దాని శిఖరాలక్రింద సూదికి గుచ్చిన పూలవలె పదునాల్గు లోకాలు ఒకదాని క్రింద ఒకటి ఉన్నాయి. ప్రతిలోకానికి నడుమ మేరువు స్పష్టంగా కనిపిస్తుంది.

మేరువుకి అధోభాగంలో ఉండే నిరాలంబస్థానానికి నిర్ఋతస్థాన మనిపేరు. ఆ ప్రదేశంలో మూడున్నర కోట్ల నరకా లున్నాయి. పురాణాల్లో చెప్పబడ్డ యిరవై ఎనిమిది మహానరకా లక్కడే ఉన్నాయి. వానిలో నిష్కృతిలేని పాపులు బాధ లనుభవిస్తుంటారు. ఈ పాపులకు భోక్తలు భోజనాంతంలో విడిచే ఉచ్ఛిష్ట తర్పణా లందుతుంటాయి. ఈనరకాలకు పైని త్రిఖండ సోపానస్థలా లున్నాయి. వానిలో ప్రథమఖండంలో అనంగరూప పాపులు, ద్వితీయ ఖండంలో ప్రేతరూపజీవులు తృతీయ ఖండంలో యాతనాదేహులు ఉంటారు. ఈ జీవులకు కర్మానుభవానంతరం దేహాంతర ప్రాప్తి ఉంది.

ఈ త్రిఖండ సోపానాలపై పాతాళ, మహాతల, రసాతల, సుతల వితల, అతల ములనే యేడులోకాలు మేడ అంతస్థులవలె ఒకదానిపై ఒకటి ఉన్నాయి. వానిలో ఒక్కొక్క దానియెత్తు వెయ్యి యోజనాలు. పరస్పరదూరం తొమ్మిదివేల యోజనాలు. ఈలోకాల్లో ఒక్కమహాతలంమాత్రం వాలుకామయ మని తక్కినవి మనగోళంవలె భూజలా లన్యోన్యాశ్రయంగా ఉన్నవని పురాణవచనం.

పాతాళం భోగభూమి. అది రెండవ స్వర్గం. అక్కడ అనంతుడు తన బలగంతో ఉంటాడు. అతనిపడగలపై, భూమి కందిగింజవలె ఉంది. ఈలోకానికి సూర్యచంద్రదర్శనంలేదు. అయినా యిది చీకటికొంపగాక అక్కడ ఉండే సర్పరాజుల తలలపై ఉండే మణులచేత ఎల్లపుడు ప్రకాశిస్తూ ఉంటుంది. దీనిపై నుండే మహాతలంలో కద్రువపుత్రులైన తక్షకాదు లుంటారు. వారికి గరుడుని భయమెక్కువ. ఈలోకంలోని మేరువు కీశాన్యంగా కైలాసముంది. దాన్ని శివుడీశానునిపేర పాలిస్తుంటాడు. ఈ రెండు నాగలోకాలు. మహాతలంపై తలాతలం ఉంది. దాన్ని మయుడు పాలిస్తుంటాడు అతడు సూర్యుని ఈ లోకంలోనే త మెన పట్టాడు. శివుడు త్రిపురాసురసంహరం గూడా యిక్కడినుండే చేశాడు ఇక్కడ మేరువు కత్తరంగా ధనిష్ఠాపు

ముంది. దీన్ని భలాలుడు తన పిశాచ గణాలతో ఏలుతుంటాడు. ఈ తలాతలం పై రసాతలం ఉంది. అది దైత్య దానవ భూమి. ఈలోకంలోని హిరణ్యపురంలో కాలకేయులు, నివాతకవచులు ఉంటారు. వాళ్లెల్లప్పుడు సరమ అనే దేవదూతి మంత్ర వర్ణాలకు భయపడుతుంటారు. ఈ లోకంలో మేరువుకు నైర్‌ఋతిగా పుణ్యాపురం ఉంది. దాన్ని నిర్‌ఋతి పాలిస్తుంటాడు. రసాతలంపై సుతలం ఉంది. అది బలిచక్రవర్తి దేశం. అతడిక్కడి నుండే ముల్లోకాలాక్రమించగా విష్ణువు వామనావతారం ఎత్తాడు. ఈలోకంలోని మేరువుకి దక్షిణంగా సంయమినీ నగరం ఉంది. దాన్ని యముడు పాలిస్తూ జీవుల పుణ్య పాపాలు విచారిస్తుంటాడు. ఈ రెండు దైత్య భూములు. ఈ లోకానికి పైని వితలం ఉంది. అక్కడ శివుడు హాటకేశ్వరుని పేరుతో పార్వతితో ఏకాంత విహారం చేస్తుంటాడు. ఈ లోకంలోని మేరువు కుత్తరంగా అలకాపట్టణం ఉంది. దాన్ని కుబేరుడు పాలిస్తుంటాడు. ఈ లోకంలోనే మేరువుకి పశ్చిమంగా మహోపట్టణ ముంది. దాన్ని మహాసురుడు అనేవాడు పాలిస్తుంటాడు. కుబేరుని సేవకాదులైన గుహ్యకులంతా ఈ పట్టణంలోనే ఉంటారు. దీనిపై అతలం ఉంది. దాన్ని మయుని పుత్రుడు బలాసురుడేలుతుంటాడు. ఇక్కడ కామినీజన మెక్కువ. వారు పాతాళం చేరే పురుషులకు సిద్ధరసఘుటిక లిచ్చి సిద్ధులను చేస్తుంటారు. ఇంతవరకివి బ్రహ్మాండకటాహంలో అధోలోకాలు.

ఈ అతలానికి పైని 'భూలోక ముంది. దానికి మహాభూమి అని' భూచక్ర మని పేరు. అది విరాట్పురుషునికి జఘన ప్రాయం. అందుచేత కవులు స్త్రీజఘనాన్ని భూచక్రంతో పోలుస్తారు. ఈ భూచక్రం మొదట దర్పణతలంవలె ఉండి క్రమంగా కూర్మ పృష్ఠంవలె మారిందని సిద్ధాంతుల అభిప్రాయం. ఇది పంచాశత్కోటివిస్తీర్ణమై తనక్రింది అతలాదిలోకాలను గొడుగువలె కప్పింది. ఆకారణంగా ఆలోకాలకు సూర్యచంద్ర దర్శనం కాలవిభాగం లేకుండా పోయాయి.

ఈలోకంవారికి సూర్యుడు మేరువును చుట్టుతూ గానుగెద్దువలె కనిపిస్తాడు. బ్రహ్మ ఆజ్ఞచే స్వాయంభువు మొదటి ప్రభువై ఈ లోకాన్ని పాలించాడు.

అతని కాలంనాటికీ భూమిపై సప్త ద్వీప విభాగం లేదు. భూజలాలన్యోన్యాశ్రయంగా ఉండేవి. ఈ భూమిపై స్వాయంభువు చేసినయజ్ఞ సందర్భంలో స్థలం చాలక అతడు శ్రీమహావిష్ణువును ప్రార్థించగా అతడుయజ్ఞవరాహ రూపం ధరించి రసాతలంలో ఉండే భూమినుండి కొంతభాగాన్ని తనకోరనుండి ఉద్ధరించి నేటిభూగోళంగా దీనిపై గల భపంజరంలో నిలిపాడు. స్వాయంభువు పిమ్మట అతని కుమారుడు ప్రియవ్రతుడు రాజ్యానికి వచ్చాడు. అతడు సూర్యుని మేరుప్రదక్షిణంవల్ల తమ లోకంలో దివారాత్రా లేర్పడటంచూచి ఎప్పటికీ పగలే ఉండాలనే కోరికతో సూర్యునిగురించి తపస్సుచేస్తూ జ్యోతిర్మయరథాన్నెక్కి అతని వెనక ఏడుపర్యాయాలు మేరు ప్రదక్షిణం చేశాడు. అతడావిధంగా చేయగా ఆరథంజాడలు సప్తసముద్రాలుగా మారి వాని నడిమిభూమి సప్త ద్వీపాలుగా మారింది. ప్రియవ్రతుడు తన చివరి కాలంలో తన ఏడుగురు కుమారుల నేడు ద్వీపాలకు రాజులను చేసి తాను సన్యసించాడు.

ప్రియవ్రతునిచే మహాభూమిపై ఏర్పడిన సప్తద్వీపాల్లో జంబూ ద్వీపం నడుమ ఉంటుంది. మహాభూమిపై గల మేరువాద్వీపంపై క్రిందినుండి పైకి ఉమ్మెత్తపూవువలె నిలిచింది. ఆ కాంచన పుష్పంపై మధ్య భాగంలో స్వర్ణమయమైన బ్రహ్మపురం దాని కెనిమిది దిక్కులలో అష్ట దిక్పాలకుల పట్టణాలు ఉన్నాయి. ఆపట్టణాల నధికృత దిక్పాలకులు పాలిస్తుంటారు.

ప్రియవ్రతునితరువాత అతని పుత్రుడు ఆగ్నీధ్రుడు జంబూద్వీపానికి రాజైనాడు. అతడు తన చివరిదశలో జంబూద్వీపాన్ని సీమాపర్వతాలను బట్టి నవవర్షాలుగా విభజించి వానిని తన తొమ్మిది మంది కుమారులకు నిచ్చి తపస్సుకు వెళ్లిపోయాడు. ఈవిధంగా స్వాయంభువు కాలంలో ఏక ఖండంగా ఉన్న భూమి ప్రియవ్రతుని కాలంలో సప్తద్వీపవసుంధరగా, ఆగ్నీధ్రునికాలంలో నవ ఖండ భూమండలంగా మారింది.

ఈమహాభూమిపై సూర్యాంతంవరకూ గలప్రదేశం భువర్లోకమని, అక్కడినుండి ధ్రువాంతం వరకు గల ప్రదేశం సువర్లోకమని వ్యవహరింప బడ్డాయి. నేడు మనం చూసే సూర్యచంద్రులు, నవగ్రహాలు, నక్షత్రాలు ఈ భువర్లోకంలోనే ఉండి మేరువుచుట్టు తిరుగుతున్నాయి. నేటిమన భూగోళం వాటిలోనే ఒకటిగా ఉంది. దాని ఊర్ధ్వఖండానికి జంబూద్వీప మని, అధఃఖండాని కసురఖండ మని పేరు. ఆ రెండు ఖండాలను లవణసముద్రం వేరు చేస్తుంది.

ఈ భూర్భువర్లోకాలు రెండూ మానవుల కావాసంగా ఉన్నాయి. వానిలో విరాట్పురుషునికి మొదటిది జఘనమైతే రెండవది వక్షస్థలంగా ఉంది.

భువర్లోకంపై నుండే సువర్లోకానికి స్వర్గ మని మరోపేరు. ఈలోకం లోని మేరువుకి తూర్పుగా ఇంద్రుని పట్టణమైన అమరావతి ఉంది.

కర్మజీవులకు భూర్భువ స్వర్లోకాలు మూడు ముఖ్యమైనవి, వారా మూడు లోకాలు తిరుగుతుంటారు. అందువల్ల సంధ్యావందనాది కర్మానుష్ఠానాలలో

'ఓంభూర్భువ స్సువః ॥ అని ఆలోకాలు తలుచు స్మరింపబడుతుంటాయి.

సువర్లోకంనుండి బ్రహ్మాండ కటాహంలో ఊర్ధ్వలోకాలారంభ మౌతాయి. అధోలోకాలవలె ఈలోకాలకు దూర నియమం లేదు. స్వర్గానికి కోటియోజనాలమీద మహర్లోక ముంది. ఆలోకంలోని మేరువుకి ఆగ్నేయంగా జ్యోతిష్మతి అనేపట్టణం ఉంది. దాన్ని యజ్ఞేశ్వరుడు పాలిస్తుంటాడు. గంధర్వులు మహర్షులు అతనికి సదస్యులుగా ఉంటారు. యోగనిష్ఠాపరులు, మాతాపితృ సేవకులు, నారాయణుని అచంచల దీక్షతో నమ్మినవారు ఈలోకాన్ని చేరుతారు. దీనిపై రెండుకోట్లమీద జనలోక ముంది. ఆలోకంలోని మేరువుకి పశ్చిమంగా అంభోవతి అనేపట్టణంఉంది. దాన్ని వరుణుడు పాలిస్తుంటాడు. అతని సభలో జనులనే ఋషులు, బ్రహ్మమానసపుత్రులైన సనకసనందనాదులు ఉంటారు. ఈలోకంలో ముల్లోకాలు తిరిగే విమానాలున్నాయి. పరదారాద్రవ్యాల కాశింపనివారీలోకం చేరుతారు. దీనికెనిమిదికోట్లపై తపోలోక ముంది. ఈలోకంలోని మేరువుకి వాయవ్యంగా అంజనావతి అనే పట్టణ ముంది. దాన్ని వాయుదేవుడు పాలిస్తుంటాడు. అతని సభలో సాధ్యులుంటారు. కర్మభూమిలో శీతవాతాతపాల కోర్చి తపంచే సేవారీలోకాన్ని చేరుతారు. దీనికి నలువదెనిమిది కోట్లపై సత్యలోక ముంది. ఆలోకంలోని మేరువు కీశాన్యంగా పురాణపుర ముంది. దానికధికృత బ్రహ్మ ప్రభువు. అతని సభలో సత్యులనే ఋషులు విద్యాధరులు ఉంటారు. ఇక్కడుండే బ్రహ్మ మనం పురాణాల్లో చదివే సృష్టిని చేస్తుంటాడు. యోగనిష్ఠులు తపోనిష్ఠులు ఈలోకాన్ని చేరుతారు.

సత్యంలోకం దాటినతరువాత మేరుపుకొండ పైకివెళ్లి నాలుగు శిఖరాలుగా చీలింది. వానిలో నడిమి శిఖరంయొత్తు నాలుగు నూర్లయోజనాలు. దానికి మూడు వైపుల మూడుశిఖరాలున్నాయి. వానియొత్తు నూరేసి యోజనాలు.

నడిమి శిఖరంపై శ్రీనగర మనే పట్టణముంది. దాన్ని మూలప్రకృతియని, బ్రహ్మవిద్యా స్థానమని చెబుతారు. ఆశిఖరంపై లలితా పరమేశ్వరి ఉండి లోకాలన్నీ పాలిస్తుంది. శ్రీనగరానికి తూర్పు శృంగంపై కారణబ్రహ్మ సరస్వతితో గూడి జగత్సృష్టి చేస్తుంటాడు. వేదశాస్త్రాలు చదివినవారీలోకాన్ని చేరుతారు

శ్రీనగరానికి నైఋతి శిఖరంపై కారణ వైకుంఠ ముంది. అక్కడ శ్రీమన్నారాయణుడు లక్ష్మీతోఁ గూడి జగత్తును పోషిస్తుంటాడు. ఆచార్యోపదేశ మందిన భాగవతోత్తము లాలోకాల్ని చేరుతారు. శ్రీనగరానికి వాయవ్య శిఖరంపై మహా కైలాసముంది. అక్కడి మహాదేవుడు పార్వతితో గూడిఉండి సర్వసృష్టిని చూస్తుంటాడు.

శ్రీనగరంపైని మేరువుకి ఊర్ధ్వభాగంలో త్రిఖండ సోపానప్రదేశముంది. అక్కడ ప్రథమఖండంలో వసుసంజ్ఞగల పితృదేవతలు, ద్వితీయ ఖండంలో రుద్రసంజ్ఞగల పితృదేవతలు, తృతీయ ఖండంలో ఆదిత్య సంజ్ఞగల పితృదేవతలు ఉంటారు. వారికి వారి సంతతి జరిపే శ్రాద్ధకర్మలచేత క్రమపరిప్రాప్తమైన ముక్తి ఉంది. ఈ త్రిఖండ సోపానంపైగల నిరాలంబస్థానానికి ముక్తిస్థాన మనిపేరు. భవబంధ రహితులైన జీవులీప్రదేశంలో నిరతిశయానంద సుఖస్వరూపులై ఉంటారు.

బ్రహ్మాండ కర్పరంలోని పదునాలుగు లోకాలలో భూర్భువ స్వర్లోకాలు మూడు ప్రతికల్పంలో నశిస్తూ బ్రహ్మచే తిరిగి సృజింప బడుతుంటాయి. అందువల్ల ఈ మూడిటిని కృతకాలంటారు. ఇవి ఏకపాద్విభూతి యని చెప్పబడుతుంటాయి. జనలోక సత్యలోక తపోలోకాలెప్పటికీ నశింపవు. అందువల్ల వాటికి అకృతకాలనిపేరు. ఈలోకాలు త్రిపాద్విభూతి యని చెప్ప బడుతుంటాయి. ఈ కృతకాకృతకాల నడుమ ఉండే మహర్లోకం నశింపదు కాని ప్రళయ సమయంలోని సంకర్షణాగ్నిజ్వాలకిక్కడి భృగ్వాదిమునులు జనలోకానికి వెళ్లుతుంటారు. ఇదిమన బ్రహ్మాండ స్వరూపం.

హిందూ వేదాంతం అండపిండ బ్రహ్మాండాలకు ఆకార భేదమేకాని అంతరభేదం లేదని అంగీకరించి మానవ దేహంలో నేయే భాగాలే లోకాలో బ్రహ్మాండంతో పోల్చి చెప్పింది.

జీవులు పురుషునిలో ఉన్నారు. బ్రహ్మాండాలు మాయావరణంలో ఉన్నాయి. జీవులా బ్రహ్మాండాల్లో ప్రవేశించినపుడు వానిలో సృష్టి ఆరంభమవుతుంది. సృష్ట్యారంభంలో ఒక్కొక్క బ్రహ్మాండాన్ని కోట్లాదిజీవులు చుట్టుముడతాయి. కాని వానిలో నేది మొదట బ్రహ్మాండభిత్తిని భేదించుకొని లోపల ప్రవేశిస్తుందో అది ఆ బ్రహ్మాండానికి బ్రహ్మ అవుతుంది. దానిలోని సృష్టి అంతా యిక ఆబ్రహ్మ అధీనంలోనే జరుగుతుంది.

స్త్రీగర్భంలోగూడా పిండోత్పత్తి ఈలాగే జరుగుతుంది. ఆమె గర్భకోశంలోని అండాన్ని వేలకొలది జీవాణువులు చుట్టు ముడతాయి. వానిలో ఏది ఆ అండాన్ని భేదించుకొని లోపలప్రవేశిస్తుందో ఆజీవకణమే పిండాని కంతటికీ ప్రధానమై దేహనిర్మాణమంతా దాని అధీనంలోనే జరుగుతుంది.

ఈ అనంతకోటి బ్రహ్మాండాలు శ్రీమన్నారాయణుని ఉదరంలో ఓమాల వనగిఉన్నట్లు పురాణాలు చెబుతాయి. పురుషుని దేహంలో ధాతు కోశ

(తరువాయి 19వ పేజీలో)

# రాష్ట్రపతి - అంతఃకరణశుద్ధి

విశ్వాసరాహిత్యాతీర్మానాన్ని ఎదుర్కొనలేక శ్రీ మురార్జీ మంత్రివర్గము రాజీనామా చేసిన తర్వాత అప్పటి ప్రతిపక్షనాయకుడు చవాన్‌ను మంత్రి నిర్మాణం నిమిత్తం రాష్ట్రపతి ఆహ్వానించియున్నారు. శ్రీ చవాన్ తన అశక్తతను తెలియచేయగా; తదుపరి మంత్రివర్గ నిర్మాణమునకు మరల మురార్జీ ఉత్సాహపడటం, మూడవ పెద్దపార్టీ అయిన జనతా (యస్) నాయకుడు శ్రీ చరణ్‌సింగు తనకు మంత్రివర్గ నిర్మాణావకాశం కోరడం, ఈ పరిస్థితులలో రాష్ట్రపతి ఆ నాయకు లిరువురను తమ తమ మద్దతుదార్ల సంఖ్యను వివరించమని అడగడం జరిగింది. వారు సమర్పించిన జాబితాలను పరిశీలించి ఇంకా ఇతర ముఖ్యులను సంప్రతించి చరణసింగుకు అవకాశం ఇయ్యడం పార్లమెంటు విశ్వాసాన్ని వీలయినంత త్వరలో పొందవలసిం దని ఆయనకు సలహా యివ్వడం విదితమే. అనుచితము అని తోచిన ఐ కాంగ్రెస్ కోరికలకి ఆయన తలఒగ్గక, అవకాశవాదానికి తావీయక, సిద్ధాంతాలకి నిలబడడం కారణంగా ఐకాంగ్రెసు ఆయనకు మద్దతు ఉపసంహరించడంచేత ఆయన మంత్రివర్గం వెంటనే రాజీనామా చేయవలసి వచ్చింది.

అపుడిక రాష్ట్రపతి కర్తవ్యంఏమిటి? పార్లమెంటులో ఏ ఒక్క పార్టీకి మెజారిటీ లేదన్న సంగతి స్పష్టం. క్షణంలో మద్దతుఇచ్చి, క్షణంలో ఉపసంహరించుకునే ఐకాంగ్రెసు బేషరతు సహాంకారం మీద ఆధారపడటం; మరిన్ని పార్టీఫిరాయింపులను ప్రోత్సహించి, ఎం పి లని ఆకర్షించి, ఆ ఫిరాయింపుదార్ల సహాయంతో మంత్రివర్గాన్ని ఏర్పరచడం; దిసదిన గండంగా అస్థిరంగా వ్యవహారం నడపడమేకదా జనతాపార్టీకి శరణ్యం.

ఇంతకీ ఒకమారు జనతాపార్టీ మద్దతుదార్ల జాబితాలో ఇచ్చిన ఎం.పి లలో అనేకులు మేమా పార్టీని సమర్థించబోమని తెలిపిన తర్వాత—వారిని పొరపాటున తన జాబితాలో చేర్చడం జరగిందని శ్రీ మురార్జీయే ఒప్పుకొన్నారుకదా—నాయకుని మార్చుకొన్నంత మాత్రాన అట్టి పార్టీని రెండవసారి ఏలా రాష్ట్రపతి ఆహ్వానించగలరు? ఆలా ఆహ్వానించక పోవడం రాజ్యాంగానికి మహాపరాధంగా ఆడిపోసుకోవడం జరిగింది. క్షణక్షణ—పార్టీఫిరాయింపు ధోరణులను కనిపెట్టిన రాష్ట్రపతి పార్లమెంటును రద్దుచేయడం తప్ప మరో రాజ్యాంగ బద్ధమైన సూత్రమింకేమున్నది? మధ్యంతర ఎలెక్షనులకి ఉత్తరువుచేస్తూ ఎన్నికైన మంత్రివర్గం వచ్చేవరకు ప్రభుత్వాన్ని నిర్వహించవలసిందిగా శ్రీ చరణ్ మంత్రి వర్గాన్ని కోరడం అసమంజసం ఏలా అవుతుంది?

ఆశాభంగము నొందిన నాయకరత్నములు రాష్ట్రపతిని అనేక విధాల విమర్శిస్తూ ఆయన పక్షపాతం చూపారనీ రాగద్వేషాలకు లోనయ్యారనీ, పదే పదే ప్రకటిస్తూండడం వల్ల - అట్టి రాగద్వేషాలతో నేను వ్యవహరించలేదు. నూటికి నూరుపాళ్ళు రాజ్యాంగబద్ధమని, న్యాయమని అంతరాత్మ ప్రబోధించిన రీతినే అంతఃకరణ శుద్ధితోనే వ్యవహరించానని ఆయన ప్రకటించియున్నారు.

అనంతరం ఆమాటలకు విజ్ఞులుకాని కొందరు రాష్ట్రపతి రాజ్యాంగబద్ధంగా వ్యవహరించాలి కాని అంతరాత్మ ప్రబోధం ప్రకారం నడుచుకోవడం తప్పనీ, హాస్యాస్పదమనీ విమర్శించారు. ప్రెసిడెంటు పదవికి శ్రీ సంజీవరెడ్డి, శ్రీ గిరి పోటీపడినప్పుడు శ్రీమతి ఇందిరా గాంధి ఉపయోగించిన అంతరాత్మ ప్రబోధం స్లోగన్ వంటిదే ఇదీ అని ధ్వనింపజేశారు.

అట్టి వారి వ్యాఖ్యలనూ, విమర్శలనూ అంతగా పట్టించుకో నక్కరలేదుకాని ఇటీవల ప్రముఖ జనతానాయకుడు శ్రీ వాజపేయి కూడా అదే పాటపాడటం చాల ఆశ్చర్యకరంగా ఉన్నది.

ఇందిరాగాంధీ తన పార్టీ అభ్యర్థిగా తానే ప్రతిపాదించిన శ్రీ సంజీవరెడ్డికి పార్టీ వోటరులు వోటు వేయనక్కరలేదనే సందర్భంలో తెచ్చిపెట్టిన అంతరాత్మ ప్రబోధానికీ, పలువురు రాజ్యాంగవేత్తలు పలువిధములుగా అభిప్రాయ ప్రకటనచేస్తూన్న సందర్భంలో ఏది రాజ్యాంగ బద్ధమూ న్యాయయుక్తమూ అనే విషయంలో సందిగ్ధ పరిస్థితి వచ్చినపుడు అంతఃకరణ, శుద్ధితో నిర్ణయానికి వచ్చాననే ప్రస్తుత రాష్ట్రపతి అంతరాత్మ శుద్ధికీ పోలిక లేదనే సంగతి అతి సామాన్యులకి కూడా తెలియవలసినవిషయం.

ఇట్టి కువ్యాఖ్యలవల్లా, దుష్ప్రచారం వల్లా, తమకు తమపార్టీకి వోటర్లవల్ల లాభం చేకూరడంకంటే అపకారమే ఎక్కువ జరుగుతుందనీ, ఇట్టి పేలవమైన ప్రచారంవల్ల తాము చెప్పే మంచిమాటలకి కూడా విలువతగ్గుతుందనీ నాయకులు గ్రహించడం మంచిది.

ఇదే విధంగా పరిశీలించవలసిన ఇతర నాయకుల ప్రసంగాలూ కొన్ని ఉన్నవి.

— సం॥



( 17 వ పేజీ తరువాయి )

మెన్నవవంతు? దానిలో జీవాణువెన్నోవంతు? స్త్రీకి దేహంలో గర్భకోశమెన్నోవంతు? దానిలో నెలనెలా ఏర్పడే అండమెన్నోవంతు? ఊహించుకుంటే పురాణాలు చెప్పే విరాట్స్వత్వం మనకు కొంతకొంత బోధపడుతుంది.

బ్రహ్మాండ కటాహంలో అధోలోకాలకంటె ఊర్ధ్వలోకాలకు ప్రాధాన్యం ఎక్కువ. మానవ దేహంలో గూడా ఉత్తరకాయానికంటె పూర్వకాయానికి ప్రాధాన్యం ఎక్కువ.

బ్రహ్మాండ కటాహంలో భూర్భువస్వర్లోకాలనడుమ తక్కిన లోకాలకువలె శూన్యంలేదు. మానవదేహంలో గూడా జఘనం మొదలు కంఠంవరకుగల దేహంలో సీమా విభాగం స్పష్టంగా లేదు. మొదటిదాని అంతం రెండవదాని ఆదిగా ఉంది.

మనభూగోళం విరాట్పురుషునికి హృదయస్థానంలో ఉంది. జీవుడు మన దేహంలో హృదయస్థానంలో ఉన్నాడు.

కర్మజీవులు విరాట్పురుషునికి కటి మొదలు కంఠంవరకుగల లోకాల్లో పరిభ్రమిస్తున్నారు. అలాగే జీవులీలోకంలో శిశ్నోదర పరాయణులుగా హృదయప్రధానవాదులుగా తిరుగుతున్నారు.

పురుషునికి నాశంలేదుకాని మాయలో కొంత కాలానికి సృష్టిశక్తి నశిస్తుంది. అపుడు ప్రళయం ఏర్పడుతుంది. సృష్టిలో పురుషునియందు బీజశక్తి నశింపదుగాని స్త్రీలో కొంత కాలానికి ధారణాశక్తి నశిస్తుంది.

ఇవి అండపిండ బ్రహ్మాండాలకు గల పోలికలు. ప్రబంధాలలో వీని ప్రసక్తిని వచ్చే పక్షంలో గమనింతము.

( సశేషము )

# ఈ పక్షంలో

ఈ నెల 25 న శ్రీ లక్ష్మీనరసమ్మ కాన్వెంటు పాఠశాలలో సారస్వతసమితి ప్రథమ వార్షికోత్సవము జరిగినది. నాటి సభకు ప్రముఖవర్తకులు, వదాన్యులు, సాహిత్యాభిమానులు, నగు శ్రీ గంధి సుబ్రహ్మణ్యముగారధ్యక్షత వహించిరి. వారు తమ అధ్యక్షోపన్యాసములో సారస్వతసమితి ప్రతిమాసము నిర్వహించు సాహిత్యోపన్యాస కార్యక్రమమును, సంస్కృతభాషా ప్రచారమునకై బాలురలో విద్యాసక్తికై చేయుకృషిని, ప్రశంసించిరి. సంస్కృత ప్రచారకులగు శ్రీ శ్రీపాద పేరయ్యశాస్త్రిగారిని, శ్రీమల్లంపల్లి దుర్గామల్లికార్జున ప్రసాద్ గారిని ఘనముగా సన్మానించి తమ వదాన్యతను, సాహితీప్రియతను వెల్లడించిరి. సన్మానితులు శ్రీ పేరయ్యశాస్త్రిగారు ఆంధ్రత్వమును గోదావరీతీర ప్రశస్తిని, సంస్కృత భాషాప్రచారమును, శ్రీ గ్రంధి వారి వదాన్యతను వివరించి ప్రశంసించిరి. శ్రీ మల్లంపల్లి దుర్గా మల్లికార్జునప్రసాద్ గారు తమ కృతజ్ఞతను వెల్లడించుచు, అధ్యాపనమున తమ కుటుంబమునకు గల యాసక్తిని వివరించి తాము పట్టి, యింగువ కట్టిన మూటవంటివార మనిరి. సారస్వత సమితి వారి సహాయము ప్రశంసింప దగినదనిరి. ఈ సన్మానము తన వెనుక నున్న ప్రతియొక్కరికి చెందు ననిరి. సంస్కృత భాషాప్రచారమునకు సహాయము నర్థించి, తమ కృషిని వివరించిరి.

శ్రీమంతులు, సహృదయులు, విద్యాపక్షపాతులు సంస్కృతాభిమానులు నగు శ్రీ ఎ. వి. రమణారావుగారు (ఆంధ్రప్రదేశ్ సేవింగ్సు అండ్ ఫైనాన్సు) సారస్వత సమితి చేయుకృషిని ప్రశంసించి తమ సహాయము ప్రతిసారి యుండు నని వాగ్దానము గావించిరి. సారస్వతసమితి వారు నిర్వహించిన గీతాపఠనము మున్నగు పోటీలలో గెలిచిన బాలబాలికలకు వలయు బహుమానములను విరాళముగనిచ్చుటయే కాక బహుమతి ప్రదానముగూడ చేసిరి. తమ సహాయము సర్వదా యుండు నని ప్రకటించిరి.

శ్రీ బుగ్గా పాపయ్యశాస్త్రిగారు (అధ్యక్షులు సారస్వత సమితి) సారస్వత సమితి యాశయములను కృషిని వివరించిరి. శ్రీ జొన్నలగడ్డ మృత్యుంజయరావుగారు సంస్కృత భాషా ప్రాధాన్యమును వివరించి, సారస్వత సమితికృషిని ప్రశంసించి, సన్మానితుల నభినందించిరి. నన్నయనాడును నిట్టి సమితులు కలవని వివరించిరి. శ్రీ తాడూరికృష్ణారావుగారు సంస్కృతభాషా ప్రాముఖ్యమును, వివరించి సన్మానితులను ప్రశంసించిరి. శ్రీ M. చిరంజీవిగారును సన్మానితులను ప్రశంసించుచు ఉచితముగా చదువుచెప్పినను ఆర్థికముగా తోడ్పడుట ప్రతియొక్కరికి కర్తవ్యమనిరి. శ్రీ జ్యోస్యుల సూర్యనారాయణగారును ప్రసంగించిరి.

శ్రీ చేబోలు శేషగిరిరావుగారు (కార్యదర్శి-సారస్వతసమితి) సమితి నివేదికను, సాంవత్సరిక కృషిని వివరించిరి. శ్రీ పున్నమరాజు నాగేశ్వరరావుగారు మొదట సభావేదికపై నున్న అధ్యక్షులను, సభాప్రారంభకులను సన్మానితులను సభకు పరిచయము గావించిరి.

శ్రీ పడాల రాధాకృష్ణగారు మొదలగువారు సమితికృషిని ప్రశంసించుచు ప్రసంగించిరి. అష్టావధాని శ్రీ బులుసు రామమూర్తిగారు ఆశువుగా పద్యములలో సభావేదికపై నున్నవారి నాశీర్వదించిరి. నగరము వర్షపర్యావుల మైనను శ్రీ దామెర్ల వెంకటరావుగారి వంటి పెద్దలు, బాలబాలికలు సుమారు వందమందికి పైగావచ్చి సభను దిగ్విజయముగా నడపించిరి. సారస్వత సమితికి సముజ్జ్వలభవిష్యత్తు కల దని పలువురాశించిరి. శ్రీ మెరపల సన్యాసిరావుగారు సమితి కృషిని వివరించి పెద్దలసూచనలను పాటింపగల మని పలికిరి.

శ్రీ నిమ్మలపూడి వీరరాజుగారి ప్రార్థనతో నారంభమైన సభ శ్రీ Ch. సాంబశివరావుగారి వందన సమర్పణముతో ముగిసినది. *



1979-80

Telugu Low Pandits Notes

## Intermediate

| | | | |
|---|---|---|---|
| I Year | గద్యభాగము నోట్సు | రూ. | 6 - 50 |
| ,, | ఉపవాచకము నరమేధము నోట్సు | రూ. | 8 - 00 |
| II Year | పద్యభాగము నోట్సు | రూ. | 8 - 50 |
| ,, | నాటకము అశ్వత్థామ నోట్సు | రూ. | 8 - 00 |

ENGLISH

| | | | |
|---|---|---|---|
| I Year | English Notes (Prose & Poetry) | రూ. | 7 - 50 |
| ,, | Select short stories (Nondetailed) | రూ. | 1 - 50 |
| II Year | English Notes (Prose & Poetry) | రూ. | 6 - 75 |
| ,, | Tales from Home and Abroad (Nondetailed) | రూ. | 1 - 50 |

| | | |
|---|---|---|
| B. Com II Year Telugu Notes (Old Poetry with text) | రూ. | 7 - 00 |
| B. A. II Year Telugu Notes (Old Poetry with text) | రూ. | 7 - 00 |
| ప్రతిమ B. Com. II Year నాటకము నోట్సు | రూ. | 8 - 50 |
| బలరామ విజయము ,, | రూ. | 8 - 50 |
| స్వప్నవాసవదత్తము, సుభద్ర B.A. II Year నాటకమునోట్సు | రూ. | 7 - 00 |
| I Year Degree Telugu Notes B. Com. (Prose & Poetry) | రూ. | 7 - 00 |
| I Year B. Sc. Poetry Notes | రూ. | 4 - 00 |
| ,, Prose Notes | రూ. | 4 - 50 |
| ,, B. A., Poetry Notes | రూ. | 4 - 00 |
| ,, ,, Prose Notes | రూ. | 4 - 50 |

For : Copies :—

*Publishers :*

# B. V. & CO.,

6-8-7, Innispeta, **RAJAHMUNDRY-1.**

ditor, Printer ~~and Publisher~~ B. Sitharama Sastry, Printed at B. V. & Co., Press, Innispe
[redacted] Nagar) Rajahmundry-1.